తెలుగు స్వతంత్ర

సంపుటి 4. సంచిక 10.

శుక్రవారం, అక్టోబరు 5, 1951.

విషయసూచిక

# రోదసి

"శార్వరి"

బొంగల్లా పాడుతున్న చలి
తెలీదు అడవుల సింగారం
నా గాయాలు అజేయ గేయాలు
ఎడారి వొదిలే నిశ్వాసం
చుక్కల కొత్త సంగీతం
నా హృదయం తప్పెడు
ఇనుము ఎప్పుడూ
గిలకచప్పుడు పాట
అణగిన స్త్రీకంఠం బాట
కాడిగట్టిన దీపపు శాపం
నిశ్వాల నిశీథంలోంచి
ఏడుస్తున్న శాంతం
అయుసాక్రాంతించిన క్రాంతం
మెరుపు కొరడా దెబ్బలు
విప్లవ పరక్లమనం
భూమిని తిన్న
పోలుస్తున్న గిరిశిఖరం
వేళ్ళు పాకిన ఎన్నాళ్లు
రాళ్లు నీవు?
పుస్తకాల మడలో
తల దూర్చిన నరుడా
వానరుడు నయం
హాయం గొప్ప భయం
కలుగులో వుండను వెలుగు
వెలుగులో కలిసిన తలపు
నీ ముఖంమీద చీకటి
సముద్రపు అలలు
ఉపరిభాగం మీద
కాంతుల నృత్యం
నత్త గువ్వల
చిత్తు కువ్వల
గడియారం ముల్లు
పిడుగుల జడి
అడుగుల సడి
నీ చుట్టూ కమ్మిన కేను
కేనులో కలిసిన నవ్వు
"అంతములేని
ఈ భువనమంతయూ

# స్వతంత్ర

సంపుటి-4
సంచిక-10

అక్టోబరు 5, 1951.

ప్రచురణ:
ప్రతి శుక్రవారం


## అభ్యుదయం అవిభాజ్యం

రానున్న ఎన్నికలగురించి తన కెంత మాత్రమూ ఆందోళనలేదని యిటీవల పండిత నెహ్రూ అభయం యిచ్చాడు. ఆయన ఆందోళన పడుతున్నది వేరేవిషయం. ఈతరం యువతీ యువకుల ఆలోచనలు ఏ విధంగా ఉన్నాయి? వాళ్లు దేశభవితవ్యం గురించి ఏమిటి ఆలోచిస్తున్నారు? ఏయే రకాల ప్రభావాలు వాళ్ళ మనస్సులమీద పని చేస్తున్నాయి? వీటిగురించి ఆయన ఆందోళన. ఇక ఆయన సంకల్పం: వాళ్ళకి ఐక్యమత్యాన్ని బోధించి వాళ్లు కుల, మత, విభేదాలకు అతీతమైన ఏకజాతీయ దృష్టి అలవరచుకునేటట్లు చేయటం.

ఎన్నికల గురించి ఎంతమాత్రమూ ఆందోళనలేని నెహ్రూ అప్పుడే భారీ గొత్తున కాంగ్రెస్ ఎన్నికల ప్రచారం ప్రారంభించాడు. గత ఆదివారంనాడు లూధియానా (పంజాబ్)లో ఆయన ప్రసంగించిన బహిరంగ సభకు లక్షకు పైగా జనం హాజరవటం, జనసమ్మర్దాన్ని పోలీసులు లాఠీలతో వెనక్కు నెడుతూంటే, ఆయనే స్వయంగా కలగచేసుకుని జనాన్ని సర్దుబాటు చెయ్యడం— యిటువంటి లాంఛనాలన్నీ సక్రమంగానే జరిగాయి. ఎన్నికల విషయమై ఎంత మాత్రమూ 'ఆందోళన' లేని నెహ్రూ యిదే రీతిని లూధియానానుండి కన్యాకుమారివరకూ ఎన్నికల 'జైత్రయాత్ర' సాగించడం, ప్రజలు లక్షలాదిగా మీటింగులకు హాజరై జయజయధ్వానాల చెయ్యడం, మహాత్మాగాంధీ, కాంగ్రెస్ పురాణప్రతిష్ఠ స్తోత్రం, యీ వేడుకలన్నీ కోలాహల భరితంగా జరగడం, త్వరలోనే దేశం చూడబోతున్నది.

ప్రజల్ని ఆకర్షించడంలో నేడు భారత దేశ నాయకులలో పండిత నెహ్రూను మించిన వాళ్ళెవరూ లేరు. నాలుగు సంవత్సరాల కాంగ్రెస్ పరిపాలన తరవాత ప్రజాజీవనం పూర్తిగా అధోగతి పాలయింది. నెహ్రూ హయాంలోనే యిది జరిగింది. అయినా ప్రజలు నిన్న మొన్నటి వరకూ ఆశలు నెహ్రూ పైననే పెట్టుకున్నారు. ఇప్పటికైనా దేశాన్ని పీడిస్తున్న అరిష్టా లేమిటో ఆయన సరిగా పోల్చుకుంటే, పోల్చుకుని ధైర్యంగా వాటి నెదుర్కుంటే, కొంతలో కొంత దేశాన్ని ముందుకు తీసుకు వెళ్ళగలడనే ఆశ అనేకులకున్నది. దురదృష్టవశాత్తూ ఆ రెండూ చెయ్యడానికి పూనుకోవడం మానేసి, ఆయన యింక వేటిమీదనో విరుచుకుపడి, యింకేవేవో మన కష్టాలన్నిటికీ కారణం అని, తన ఆలోచనా శక్తిని

సంకీర్ణం చేసుకుని మనలో నిస్పృహ యినుమడింప చేయడం జరుగుచున్నది

'కమ్యూనలిజం' ఆయన ప్రత్యేక శత్రువు. దేశాభ్యుదయాన్ని కోరే వారిలో ఎవరికీ యీ విషయంలో ఆయనతో పేచీ లేదు. మత దురహంకారాన్ని ఏ ప్రగతివాదీ సహించడు. ఇటీవల నెహ్రూ యీ కమ్యూనలిజాన్నే ప్రచారసాధనంగా తీసుకుని, దేశానికి అన్ని విధాలా అడ్డు తగులుతున్నది కమ్యూనలిజమ్ అనీ, దాన్ని నిర్మూలిస్తేనేగాని మనకు మోక్షం లేదనీ, పదేపదే మన్నల్ని హెచ్చరిస్తున్నాడు. ఆయన ప్రత్యేక ఆగ్రహానికి గురి ఐనవి హిందూ మహాసభ, రాష్ట్రీయ స్వయంసేవక సంఘం, జనసంఘం. కమ్యూనలిజమ్ గుత్తకి తీసుకున్నది పై మూడు సంస్థలే అన్నట్లు ఆయన మాటాడాడు. దేశవిభజన తర్వాత ఇండియాలో ముస్లిములు 'కమ్యూనలిజమ్' బీజాలు విస్తరిల్ల చేయడానికి అవకాశం లేదన్నాడు కాని ఏనాడైతే నెహ్రూ యీ విధంగా బహిరంగంగా అభిప్రాయపడ్డాడో- అదేరోజున మద్రాసులో ముస్లింలీగ్ నాయకుడు జనాబ్ మహమ్మద్ ఇస్మాయిల్ ప్రసంగిస్తూ, ముస్లింలీగ్ సంస్థ ప్రత్యేకంగా ఉండి తీరవలసిందే అన్నాడు. మెజారిటీ వర్గానికి ప్రత్యేక సంస్థ అనవసరం అనీ, మైనారిటీ వర్గానికి అత్యవసరమనీ, ఆయన అభిప్రాయం. ఇక్కడ మెజారిటీ మైనారిటీ వర్గాలను ఇస్మాయిల్ మతప్రాతిపదికగా వాడాడని మరిచిపోకూడదు. దేశంలో విధిగా రెండు ప్రత్యేకమైన విభిన్న సంస్కృతులు ఉన్నాయని ఆయన బలగుది చెప్పాడు. భారతరాజ్యాంగం యీ "సత్యాన్ని" అంగీకరించి, మైనారిటీ వర్గం (అంటే ముస్లింవర్గం) ప్రత్యేక సంస్థను ఏర్పరుచుకునే హక్కు గుర్తించిందని కూడా హెచ్చరించాడు.

'కమ్యూనలిజమ్' నిర్మూలించబడాలన్నది ఉదాత్తమైన, అత్యవసరంగా సాధించవలసిన, ఆశయం కాని, ఎలాగన్నదే ప్రశ్న. పదేపదే అరిచి కేకలు వేసినంతమాత్రాన అది తొలగిపోదు. నేడు దేశాన్నిపట్టి పీడిస్తున్న వ్యాధి అది కానే కాదు. రోగలక్షణాన్ని రోగంగా భావించుకుంటున్నాడు నెహ్రూ. మత ప్రసక్తిలేని ఏక జాతీయత ప్రజలకు అలవడేటట్లు చెయ్యాలంటే, ముందు ప్రజల ఆర్థికస్థితి చక్కబరచాలి. కాశ్మీర్‌లో షేక్ అబ్దుల్లా దీన్ని ఎలా సాధించాడో పండిత నెహ్రూయే వర్ణిస్తున్నాడు. కాని, యిక్కడ తన చేతిలోఉన్న కాంగ్రెస్ సంస్థ, ప్రభుత్వం, నానాటికీ ధనికవర్గాల చేతుల్లో కీలుబొమ్మలుగా వ్యవహారించి ప్రజాకంటకంగా పరిణమిస్తూంటే, అరికట్టలేకపోయాడు. కాంగ్రెస్ తప్ప తక్కిన రాజకీయపార్టీలు తమ ఎన్నికల ప్రణాళికలలో 'అరచేతిలో వైకుంఠం' చూపిస్తాయని ఆయన హెచ్చరిక. గత ఎన్నికలప్పుడు కాంగ్రెస్ చేసిన వాగ్దానాల్లో పదోవంతు కాంగ్రెస్ ప్రభుత్వాలు నెరవేర్చినా, నేడు దేశానికి యీ గతిపట్టి "కమ్యూనలిజమ్" యీ విధంగా చెలరేగక పోవును. ప్రజల ఆర్థికస్థితితో నిమిత్తంలేని రాజకీయాలు ఉండవు. ఆర్థికరంగంలో అభివృద్ధి నిరోధక శక్తులకు అండగా నిలిచినన్నాళ్లు పండిత నెహ్రూ తక్కిన రంగాల్లో అభివృద్ధి నిరోధకుల్ని అరికట్టలేడు.

# కాంగ్రెసు - అవకాశవాదులు

సరిపల్లి ద్వారకనాథ్

కాంగ్రెసు సంస్థపై ప్రజానీకానికి ఏర్పడ్డ అసంతృప్తిని అవిశ్వాసమునూ తొలగించి, వారి భక్తి విశ్వాసములను తిరిగి ఆ సంస్థపై కేంద్రీకరింప చేయుటకు నెహ్రూ పూనుకొని విఫలుడైనాడని చెప్పవచ్చు. కాంగ్రెసు పార్టీకి చెడు పేరు తెచ్చి, రెండు నాలుకలతో వ్యవహరిస్తున్న "పెద్దమనుషు"లంతా సంస్థ బయటకు నడవవచ్చునని నెహ్రూ స్పష్టంగా చెప్పేడు. దానితో అంతవరకు గొడ్డిగా అజాగ్రత్తగా ఉన్న కాంగ్రెసులోని గుప్తశక్తులూ, ఉపగ్రహాలు తక్షణమే మేలుకొని, సంస్థలో తమ స్థానాన్ని మరింత బలపరచుకొని తిష్ఠవేసుకొని కూర్చున్నవి. కాంగ్రెసు సంస్థలో అవినీతి, స్వార్థమూ పెచ్చు పెరగడంవలన వేరేమార్గం లేక కిద్వాయ్, కృపలానీ, పి. సి. ఘోష్ వంటి వ్యక్తులందరూ కాంగ్రెస్‌నుండి బయటకు నడిచేరు. కాంగ్రెస్ ప్రభుత్వాన్ని గద్దెనుండి దింపితే నే గాని ప్రజలకు మోక్షంలేదని భావించి, వీరు ప్రజాపార్టీ స్థాపించేరు. ఇదే అభిప్రాయముతో అనేక పార్టీలు బయలుదేరినవి. ఏదోవిధంగా కాంగ్రెసును దెబ్బతీయడం ప్రధాన సమస్య గనుక ఈ పార్టీలు ప్రతిపక్షవర్గములతో అనుకూలమైన ప్రదేశాల్లో చేతులను కలపటానికి సిద్ధంగా ఉన్నవి.

ఈ పరిస్థితులలో కాంగ్రెస్ పరువు ప్రతిష్ఠలు కాపాడేందుకు కంకణం కట్టుకొని నెహ్రూ వర్కింగ్ కమిటీని పూర్తిగా సంస్కరించాలనీ, "కాంగ్రెస్‌లో నూతనోత్తేజము కలిగిందనీ, దానిలో అపూర్వ పరివర్తన వచ్చిందనీ ప్రజాసామాన్యం భావించేటట్టుగా" చెయ్యాలని ప్రయత్నించి విఫలుడైనాడు. నెహ్రూజీ ప్రకటించిన క్రొత్త వర్కింగ్ కమిటీ సభ్యుల జాబితా వలన ప్రజలకు పూర్తిగా ఆశాభంగమయింది. వర్కింగ్ కమిటీ పునర్నిర్మాణముద్వారా నెహ్రూ తన ఆశయాలను సాధించలేదన్న విషయం సర్వజన విదితము.

కాని కాంగ్రెసు సంస్థ తిరిగి నిర్మలమైనదనీ, కాంగ్రెసునుండి బయటకు నడిచిన వ్యక్తులు తిరిగి కాంగ్రెసులో చేరవలసిందనీ, నెహ్రూ ఆహ్వానాలు జోరుగా విసురుతున్నాడు. ఈ ఆహ్వానాన్ని అందుకొని అప్పుడే కాంగ్రెసులో తిరిగి ప్రవేశించాలని చాలమంది చూస్తున్నారు. ఈ విషయమై 'విజిల్' పత్రికలో సంపాదకీయము వ్రాస్తూ ఆచార్య కృపాలనీ "ఇప్పటి ప్రభుత్వమును పూర్తిగా మారిస్తే గాని ప్రజలకు మోక్షంలేదని భావించి కాంగ్రెసునుండి వైదొలగినవారు, తిరిగి ఈనాడు ఈ నెహ్రూ ఆహ్వానాన్ని స్వీకరించి కాంగ్రెస్‌లో చేరితే, అది అవకాశవాదం అనిపించుకోదా?" అని అన్నారు. ఇది ముమ్మాటికీ సత్యం.

కాని తిరిగి కాంగ్రెస్‌లోచేర సంకల్పించుకొన్న యీ పెద్దమనుషులంతా అంటున్న దేమిటంటే, వర్కింగ్ కమిటీ పునర్నిర్మాణంద్వారా కాంగ్రెసు 'పవిత్ర'మయింది కనుక తాము కాంగ్రెసులో తిరిగి కలవడానికి అనుకూల పరిస్థితులు ఏర్పడినవని. నూతన వర్కింగ్ కమిటీ సభ్యుల జాబితాను పరిశీలించిన పిమ్మట "కాంగ్రెసు యథాప్రకారంగానే ఉండగల"దని జోస్యం చెప్పిన శ్రీ కిద్వాయ్ సహితము తన అభిప్రాయాన్ని తిరిగి ఈనాడు మార్చుకోవడం చూస్తే ఆశ్చర్యం వేస్తోంది.

పాత వర్కింగ్ కమిటీ యొక్క ఇద్దరు పాత కార్యదర్శులు తొలగింపబడినారు కనుక కాంగ్రెసు సంస్థ కల్మషరహితమైనదని, తను ఆ సంస్థలో తిరిగి చేరడానికి ఏ అవరోధములు లేవని అన్న శ్రీ కిద్వాయ్ ప్రకటనలో ఎంత నిజం ఉన్నదో మనం గ్రహించగలము. పాత వర్కింగ్ కమిటీ కార్యదర్శులలో అప్పుడే ఒకరు మదరాసు మంత్రివర్గంలో చోటు చేసు

కాని. "దేశసేవా" భారం మీద వేసుకున్నారు! క్రొత్తగా కార్యదర్శులుగా నియమింపబడ్డ శ్రీలాల్ బహదూర్ శాస్త్రి, శ్రీనివాస మల్లయ్య గారు ప్రజానీకానికి సరిక్రొత్తవారు. పైగా విషమపరిస్థితులను ఎదుర్కొన వలసియున్న నేటి కాంగ్రెస్ సంస్థకు యిట్టి అనామకులు, అనుభవముచాలని వ్యక్తులు కార్యదర్శులుగా నియమింపబడడం ఆ సంస్థను మరింత బలహీన మొనర్చునేమో కాగలదు.

అయినప్పటికీ "నెహ్రూ కాంగ్రెస్ వర్కింగ్‌కమిటీని మార్చివేసేరు కనుకనూ, నిజాయితీ, శక్తిసామర్థ్యాలు కలవారే కాంగ్రెస్ అభ్యర్థులుగా వుండాలని ప్రకటించేరు కనుకనూ, నెహ్రూ యిట్టి విషయాలపై పట్టుదల చూపుతున్నపుడు సహాయం చేయడం తమ విధ్యుక్త ధర్మం కనుకనూ, కాంగ్రెస్ బయటనే ఉండిపోవడానికి తగిన కారణాలు కనిపించటంలేద"ని శ్రీ కిద్వాయ్ సెలవిచ్చేరు. మంచిదే. కాని ఏ ఆశయం కొరకు వర్కింగ్ కమిటీ పునర్నిర్మాణము జరిగిందో ఆ ఆశయం సాధించబడ్డదా? నిజాయితీకి కట్టుబడిన వ్యక్తులే కాంగ్రెసు అభ్యర్థులుగా నియమించబడాలని నెహ్రూజీ చెప్పినంత మాత్రాన, అట్టిది జరుగుతుందన్న "గ్యారంటీ" ఏమీలేదే.

కాంగ్రెసులో చేరడానికి ముందు కలకత్తాలో సెప్టెంబరు 28వ తేదీన జరుగనున్న కె. యం. పి. పార్టీ కార్యవర్గములో మిత్రుల సలహా తీసుకోవలచాడని, అంతమాత్రాన వారి నిర్ణయానికి తను బద్ధుడు కావాలన్న అవసరం ఎంతమాత్రం లేదని శ్రీ కిద్వాయ్ అన్నారు. సమావేశమయింది గాని ఈ విషయమై ఇంకా ఏ నిర్ణయము జరగలేదు. ప్రజాపార్టీని ఎంత మాత్రమూ రద్దు చేయబోమని స్పష్టం చేసిన ఆచార్య కృపలానీ, డాక్టరు ఘోష్ మొదలైన వారు ఎలాగు కిద్వాయ్‌ను వదలిపెట్ట గలరు? మిత్రులు కిద్వాయ్ నిర్ణయానికి ప్రతికూలంగా ఉన్నప్పటికీ ఈయనకు కాంగ్రెస్‌లో చేరవలెనని వుంటే ఆ విధంగా చేస్తారన్నమాట! అంత మాత్రానికి మిత్రుల సలహా ఎందుకో? ఇంకా కిద్వాయ్ ఎట్టి నిర్ణయానికి రాలేదు. డాక్టరు అంబేద్కరు రాజీనామాను నెహ్రూ ఆమోదించడం, త్వరలో రాజాజీ తన రాజీనామా పత్రాన్ని దాఖలుచేయబోవడం, ఇవి కిద్వాయ్ భవిష్యత్ నిర్ణయాన్ని బహుశః నిర్ణయించ గలవేమో!

ఇదే విధంగా కాంగ్రెస్‌లో చేరవలసిందని నెహ్రూ ఘోష్‌ను, మధ్యప్రదేశ్ ప్రజాపార్టీ నాయకులను ఆహ్వానించేరు. కాంగ్రెస్‌లో చేరడానికి శ్రీ ఘోష్ నిరాకరించేరు. తిరువాన్కూరు ప్రజాపార్టీని రద్దుచేసి, కాంగ్రెసులో చేరనున్నారని శ్రీ ఇలాకాంత్ వెల్లడి చేసేరు. ఇదే విధంగా కాంగ్రెసు నుండి బయటకు నడచిన ప్రజాపార్టీ నాయకులు మరికొందరు తిరిగి కాంగ్రెసులో ప్రవేశించుటకు ఆలోచిస్తున్నారు. ఏది ఎలా ఉన్నప్పటికీ ప్రజాపార్టీని రద్దు చేయనని కృపలానీ ఉద్ఘాటిస్తున్నారు. కృపలానీ అన్నట్లు వీరు తిరిగి కాంగ్రెస్‌లో చేరితే అవకాశవాదులుగా ప్రజలు గ్రహిస్తారు.

అయితే ఒక మాట మాత్రము పరమసత్యం. "వర్కింగ్ కమిటీ పునర్నిర్మాణం ద్వారా కాంగ్రెసులోని కుళ్లు, అవినీతి, స్వార్థము మొదలైనవి నాశన మొనర్చబడ్డాయి. అందుచేత మేము కాంగ్రెసులో చేరుతాము" అని వీరు తలిస్తే కాంగ్రెసులో కాలు పెట్టకుండా ఉండటమే వారు చెయ్యవలసిన మొదటి పని. అది అత్యవసరం కూడా.

——:O:——

నాగపూర్, అక్టోబర్ 1—ఇప్పుడు మధ్యప్రదేశ్ మంత్రులుగా వున్నవారు వచ్చే ఎన్నికలలో గెలుస్తామా అనే ఆందోళనలో పడ్డారు. ముఖ్యమంత్రి శ్రీ శుక్లా, సివిల్ సప్లయిమంత్రి శ్రీ గోపాలరావు కాళే మూడేసి నియోజక వర్గాలకు అర్జీలు దాఖలుచేశారు. అర్థికమంత్రి శ్రీ. డి. కె. మెహతా గెలుపొందే అవకాశాలు లేవని కూడా వార్త వచ్చింది —ఆంధ్రప్రభ వార్త.

(48వ పేజీ తరువాయి)

గున వచ్చారు. పచ్చ తోరణాలు, రంగురంగుల కాగితపు తోరణాలతో పల్లెంతా కళకళలాడుతూంది.

పెండ్లిపీటల పనులన్నీ పూర్తి చేసుకున్నాక ఊరేగింపు ఊర్లోకి బయలుదేరింది. చుట్టూ గ్యాస్‌లైట్ల వెలుతుర్లు ఊరివరకు వికసిస్తున్నాయి. కుర్రకారంతా జట్లుజట్లుగా బానా కర్రలు చేతబూని బారులు తీరి ముందు నడుస్తున్నారు. అడుగడుక్కీ అంచెలు వేస్తున్న యువకులంతా కత్తిసాములతో కదం త్రొక్కుతున్నారు. కుస్తీపట్ల నైపుణ్యాన్నంతా నెమరు వేస్తున్నారు. ఈలలతో ఒక్క ఇసురిసురుగూ నడిఊరిలో వున్న మాధవయ్య ఇంటి ముందు మెట్ట వేశారు. మెట్టవేయటంతోటే మేళాలన్నీ మరింత మ్రోగుతున్నాయి. సన్నాయి స్వరాలకు డోళ్ళు సుస్వరాయింపులు పలుకుతున్నాయి. చలి కాపు గాన్న తప్పెట్లను కణకణమని వరసలు పలికిస్తున్నారు. మధ్య తరగతి రైతుల మొఖం చూద్దామన్నా కనపడటం లేదు. ఇంక బీద బిక్కంతా బజార్లోకివచ్చారు. దానిలో కొందరు కర్రలు పట్టి ప్రక్కనే నిలబడి వున్నారు.

ఇంటిముందు చేరి ముఖం వలుపు చేస్తున్నందుకు మాధవయ్యకు అరికాలి మంట, నసాళాని కంటింది. బజారంతా కావలసినంతమంది కాపులు కనపడటం చూచి, "చూస్తారేం? రాండి" అంటూ ముందుకు బయలుదేరాడు. పక్కనే పదిమంది పళ్ళు కొరుక్కుంటూ కోపు కాస్తున్నారు. "ఆపండి, ఆపండిరా! మా మాదిగలకు మదమెక్కి కాకపోతే ఊరేగింపు ఏమిటి?" అనే మాధవయ్య మాటతో అంతా నిశ్శబ్దమైంది. ఎదురు మాట లేకపోవటంతో మాధవయ్యకు మరింత హుషారెక్కింది. మాటల్తోనే మల్లంతారనుకున్నాడు.

"మాట్లాడరేం? వెనక్కు తిరగండి. తిరిగినంత వరకు తప్పు క్షమించాం" అని, చేతి కర్రను అడ్డం తిప్పి మరేయబోయాడు. వెనకనుండి బానా కర్ర ఒకటి బస్లాడుతూ నెత్తిన పడేటప్పటికి దానికితోడు కాపుల కర్రలు కూడా మాధవయ్య మీదనే కోలాట మాడేటప్పటికి క్రిందపడి మన్ను తిన్నాడు. పక్కనున్న పది మందిని సహితం పట్టి పచ్చడి పచ్చడిగా నలగేశారు. ప్రతివాడూ చేతికందిందాంతో చితక పాడిచారు. అంతలో రామిగాడు "ఇంక ఆపండి బుద్ధి వచ్చి ఇకనైనా బాగా బతకమనండి" అని కేక వేసినంతనే వ్రాకిర్లు వ్రాడకుండా వదలి పెట్టారు.

ఊరేగింపు విజయ చిహ్నంగా నడికార్ల నాదాలు అవ్వాయి తువ్వల్లాగా ఆకాశాన్నంటుతున్నాయి. ఊరేగింపు ఏ అడ్డు ఆపు లేకుండా ముందుకు నడిచింది. రామిగాడు జనాన్ని చూస్తూ చేతులెత్తుతుంటే అందరూ దంపతులకు దీవెన లిస్తున్నారు. వీధి వీధి విడువకుండా తిరిగారు. మసక చీకట్లు మాయమయి తూర్పు వెలుతురు విరజిమ్ము వేళకు పల్లెకు పయనమయ్యారు. కాపులంతా ఊరి చివర వరకు కలసి వెళ్ళారు. అంతలో ఒకడు పరుగెత్తుకుంటూవచ్చి "అరేయ్! మాధవయ్య సర్కారును సాయం తీసుకొస్తాడంటరా" అన్నంతనే అందరూ నవ్వారు. "ఇంక వాడి చావుకేగా సర్కారు సాయం" అనుకొని అందరూ ఇండ్లకు చేరారు.

# కడపజిల్లాలో కరువు

గత ఏడాది కడప జిల్లాలోని అనేక ప్రాంతాలలో పైర్లు పూర్తిగా పోయాయి. మూడేండ్ల నుంచి సరిగా పండని ప్రాంతాలు కొన్ని వున్నాయి. పైగా ఈ ఏడాది సైతం సెప్టెంబరు వరకు వర్షాలు లేవు. ఇటీవలనే వర్షం కొద్దిగా పడ్డా సరిగా పదును కాలేదు. అయినా కాలం దాటిపోతూందని విత్తనం సాగించారు. నాలుగు అయిదు దినాలలో వర్షం లేకపోతే మొలచిన పైర్లుకూడ ఎండిపోతాయి.

రెండు. మూడు నెలలనుండి, గ్రామాలలోని వ్యవసాయకూలీలు, తదితర పేదలు పస్తులుంటూ వచ్చారు. మధ్యతరగతి రైతులు అప్పో, సప్పో తెచ్చి కొనుక్కొని తింటూ కాలాన్ని గడిపారు. కాని యిప్పుడు గ్రామాలలో గింజ లేమాత్రం లేవు. నూటికి మూడు రూపాయల వడ్డీ చొప్పునగూడా పరపతి బొత్తుగా పుట్టడం లేదు. దీనితో మధ్యతరగతి రైతాంగం కూడా పస్తులుండటం సామాన్యమైపోయింది. ఇక పేదల సంగతి చెప్పనవసరమే లేదు. గ్రామాలలో పనులు లేవు. రెండు రోజుల కొకసారి గూడా తిండి దొరుకుటలేదు. గ్రామాలనుంచి పేదలు వలస పోతున్నారు. కాయో, కసురో తింటామని కొందరు కొండలకు పోతున్నారు.

మేత లేక పశువులు చనిపోతున్నాయి. కొందరు అయినకాడికి అమ్మివేస్తున్నారు. కపిలబావులలో నీరు లేదు తోటపైరులు కూడా దెబ్బతినే ప్రమాదమేర్పడినది. కొనగలిగిన కొద్దిమంది రైతాంగానికి గూడ, గ్రామాలలో ధాన్యం దొరకుటలేదు. రూపాయకు 1¼ శేరు జొన్నలు యిస్తున్నారు. 70 శేర్ల మూట బియ్యం 130 రూ. అమ్ముతున్నది. ఆకలి బాధతో పస్తులతో బాధపడే ప్రజలు ఈ నెల 20వ తేదీన ముద్దలూరువద్ద 2 లారీల ధాన్యాన్ని లూటీచేసి పంచుకొన్నారు. పరిస్థితి యింత తీవ్రంగా వున్నా, ప్రభుత్వం ఏమాత్రం కదల లేదు. చౌక ధాన్యపు డిపో ఒక్క గ్రామంలో కూడా తెరవలేదు.

ప్రస్తుతం ఇప్పటికైనా ధాన్యాన్ని వెంటనే విరివిగా దిగుమతి జేయించి, గ్రామాలలో చౌక డిపోలు తెరవాలని కోరుతున్నాం. రైతాంగానికి వుచిత అప్పులివ్వాలని, బీదప్రజలకు కరువు పనులు ప్రారంభించాలని, ప్రభుత్వం గడ్డి డిపోలు కూడా తెరవాలని కోరుతున్నాం.

ఏమాత్రం వుపేక్ష చేసినా పరిస్థితులు తీవ్రమై ఆకలి చావులకు దారి తీస్తాయని హెచ్చరిస్తున్నాము.

కడప — కె. దస్తగిరి.

వస్తున్న ఎన్నికలలో

# అతివాదుల బాధ్యత, కర్తవ్యం

రావెళ్ల హానుమంతరావు

ఆంధ్రదేశ కాంగ్రెసు పార్లమెంటరీ బోర్డు వారు ఆంధ్రదేశంలో పర్యటన చేస్తున్నారు. ఢిల్లీ పార్లమెంటు సభ్యత్వం కోసం మదరాసు అసెంబ్లీ సభ్యత్వం కోసం దరఖాస్తులు పెట్టుకున్న వందలకొలది అభ్యర్థులను వీరు కలుసుకొంటున్నారు.

ఆంధ్రదేశానికి సంబంధించినంత వరకు నూటనలభై సీట్లకు దాదాపు వెయ్యి దరఖాస్తులు వచ్చాయి. దీన్నిబట్టి నిర్ణయించుకోవచ్చును, కాంగ్రెసు టిక్కెట్టు విలువను. దాని విలువ పెరిగిపోయిందని పాఠకులు ఊహించవచ్చు. దరఖాస్తుదారు లెవ్వరో, వారికున్న అర్హతా లేమిటో, పరిశీలించితే కాంగ్రెసు టిక్కెట్టుకోసం ఎలాంటి వారు దరఖాస్తులు పెట్టుకున్నారో తెలుస్తుంది. ఇది తెలుసుకున్నప్పుడు కాంగ్రెసు టిక్కెట్టుకివ్వవలసిన విలువ కూడా తేలిగ్గానే అర్థమౌతుంది.

నిన్న మొన్నటి వరకు బ్రిటిష్ పరిపాలనా సౌధానికి మూలవిరాట్టులుగా నున్న మీరాందారీవర్గంవారు నేడెంతో ధైర్యంగా కాంగ్రెసు టిక్కెట్టుకోసం దరఖాస్తు పెట్టుకున్నారు. దొంగ వ్యాపారం చేసి ప్రజలను దోచుకొని లక్షల కొలది రూపాయలను సంపాదించుకొన్నవాళ్లు కాంగ్రెసు టిక్కెట్టుకోసం దరఖాస్తు పెట్టుకున్నారు. కరువు, కాటకాల కెరయై ప్రజలు "అన్నమో రామచంద్రా" యని అలమటించుతూంటే, వేలకొలది బస్తాల బియ్యాన్ని గోడౌన్లలో దాచేసి ప్రజల ప్రాణాలతో చెలగాటమాడిన ప్రబుద్ధులంతా కాంగ్రెసు టిక్కెట్టు కావాలంటున్నారు. గతకాలంలో అసెంబ్లీ సభ్యత్వం కలిగివుండి కూడా తమ నియోజక వర్గంలోని ప్రజలకు ఏమాత్రం సహాయం చేయలేకపోయిన పెద్దమనుష్యులంతా తిరిగి తమకే కాంగ్రెసు టిక్కెట్టు కావాలంటున్నారు. ఇంతకు పూర్వం తమ కెలాంటి పదవులు లేకపోయినా తమ చుట్టాలకో స్నేహితులకో వున్నాయని చెప్పి వారిద్వారా ప్రజలకు కావలసిన పనులు చేయించుతామని మోసగించి లాభాలు పుచ్చుకున్నవారంతా ఈనాడున కాంగ్రెసు టిక్కెట్టు కావాలంటున్నారు. పల్లెల్లో హరిజనులకున్న బాధలేమిటో వాటినివారణకు మార్గాలేమిటో తెలుసుకోవడానికి కూడా ప్రయత్నం చేయని పెద్దలు, ఇంత వరకు హరిజనాభ్యుదయానికి ఎలాంటి కృషినీ చేసియుండని పెద్దలు నేడు హరిజన సీట్లు కావాలంటున్నారు.

ఇది కాంగ్రెసు టిక్కెట్టుకు విలువ పెరగటమో తరగటమో మనం ఊహించుకోవచ్చును. ఇలాంటి అల్లాటప్పాకమంతా సామాన్య సభ్యులుగా చేరడానికి కూడా శక్యంగాని నిబంధనలతో నిండియున్న కాంగ్రెసుకు యీనాడింత బలహీన స్థితి ఎందుకు వచ్చింది? దీనికి రెండు కారణాలున్నాయి.

మొదటి కారణం కాంగ్రెసు పేరుతో అసెంబ్లీలకుగాని, పార్లమెంటుకుగాని నిలబడదలచుకున్నవారు ప్రజాసేవ తప్పనిసరిగా చేయాలనే నిబంధన లేకపోవడం.

కాంగ్రెసు టిక్కెట్టు నాధారం చేసుకొని పై సీట్లను సంపాదించుకున్నవారు తమ నియోజక వర్గంలో కనీసం నెలకు పదిహేను రోజులైనా ప్రజా సమస్యలమీద పనిచేయాలనే నిబంధన పెట్టితే ఎంతమంది కాంగ్రెసు టిక్కెట్టు కావాలనేది తెలిసేది. ప్రభుత్వం చేసే నిర్ణయాలకు ఇప్పుడు అసెంబ్లీ సభ్యులకు ఆచరణలో యెలాంటి సంబంధాలు లేవు

అధికోత్పత్తి చేయాలని ప్రభుత్వం నిర్ణయం చేసిందనుకుందాం. అధికోత్పత్తి యెలా సాధ్యమౌతుంది? ఇది సాధ్యం కావాలంటే ఉత్పత్తిదారుడైన రైతుకెలాంటి సౌకర్యాలు కలుగచేయాలి? వ్యవసాయ సమస్యను తక్షణమే పరిష్కరించాలని, దున్నేవానికే భూమిపై హక్కు

కలుగ చేయాలని రైతుకు కావలసిన యెరువులు, విత్తనాలు, వ్యవసాయ పనిముట్లన్నిటినీ సకాలంలో సరైన ధరలకు అందచేయాలని పంట బోదెల మరమ్మతు చెయాలని, మురుగు బావు లనతుల నేర్పరచాలని, ఇవన్నీ జరిగినప్పుడే అధికోత్పత్తి కృషి జయప్రద మవుతుందనే సంగతి అసెంబ్లీ సభ్యులు గట్టిగా ప్రభుత్వానికి చెప్పరు. ఈ సౌకర్యాలేమీ లేనికారణంగా రైతు నిస్పృహపడి నిస్సహాయ స్థితిలో వుండి అధికోత్పత్తికి పూనుకోవడం లేదు. కాబట్టి గ్రామాల్లో రైతులవద్దకెళ్ళి ప్రభుత్వ నిర్ణయాన్ని నెరవేర్చమని ప్రబోధం చేయలేరు.

అట్లాగే ధాన్యసేకరణ విషయం గూడాను. ధాన్యసేకరణకు పూనుకునేటప్పుడు రైతుకుటుంబాల పరిస్థితులను గూడా గమనించాలని, వారి కుటుంబాలకు కావలసిన నిత్య జీవితావసర వస్తువులనుకూడా కంట్రోలుధరల కింద చేయడం అవసరమని, దీన్ని గురించి పనిచేసినప్పుడు ధాన్యసేకరణ కార్యక్రమము సులభంగా జయప్రద మౌతుందని ప్రభుత్వంతో చెప్పలేరు. ఇటు రైతులదగ్గరకొచ్చి తమ ఖర్చులకు పోగా మిగిలిన ధాన్యం వెంటనే కరువు ప్రాంతాలకు పంపించడానికి సహాయపడమని చెప్పరు.

అటు ప్రభుత్వం చేసే నిర్ణయాలతోగాని, ఇటు ప్రజలుపడే బాధలతోగాని యీ ఎం. ఎల్. ఏ. లకు యేటువంటి సంబంధముండదు. వారి పనల్లా మినిష్టరుకు హాజరు కావటం, జీతాలు-భత్యాలు పుచ్చుకోవటం, తమకున్న పదవిని వినియోగించుకొని ఆఫీసర్ల దగ్గరకువెళ్ళి తమకో, తమ చుట్టాలకో తమ స్నేహితులకో ఏవో పర్మిట్లు సంపాదించుకోవడానికి ప్రయత్నించటం, ఇదిఫలించితే లాభాలు సంపాదించటం, ఇంతేపరిమించిన కార్యక్రమము వీరికిలేదు. కనుకనే ప్రతి ఒక్కరూ తమకంటు తమ ఎక్కట్లకోసం తాపత్రయ పడుతున్నారు.

ఇక రెండో కారణం: ప్రస్తుతం మంత్రులుగా వున్నటువంటి పెద్దలు, పార్లమెంటరీ బోర్డు సభ్యులుగా వున్నటువంటి పెద్దలు ఇతర ముఠాల వారందర్నీ కలుపుకుపోవాలనే ఉద్దేశ్యంతో ప్రతి ముఠానాయకునికి ఏదో ఒకపదవి నిస్తామని ఆశ కల్గించారు. అట్లాగే కాంగ్రెసునుండి చీలిపోయిన వారిని గూడా తిరిగి కాంగ్రెసులో కలుపుకు నేందుకు పదవుల ఆశ చూపించారు.

ఈ విధంగా రకరకాల వారందరికీ ఆశలు కల్పించటంవల్లనే నేడు వారంతా కాంగ్రెసు సీట్లకోసం దరఖాస్తులు పెట్టుక కూర్చున్నారు. తమకే గనుక సీటు ఇవ్వకపోతే కమ్యూనిస్టులతో కలుస్తామనో, లేక స్వతంత్రంగా కాంగ్రెసుకు పోటీగా నిలుస్తామనో బెదిరించు తున్నారు.

మొత్తంమీద యీ నాటికి కాంగ్రెసు ప్రతిష్ట పూర్తిగా బజారున పడింది. కాంగ్రెసు చరిత్రలో ఇంతకుముందెన్నడూ లేనటువంటి బలహీనస్థితి యేర్పడింది. దీని కారకులు ప్రస్తుతం అధికారంలోనున్న పెద్దలని చెప్పక తప్పదు.

వారిప్పుడుగూడా ఏదోవిధంగా వివిధ ముఠాలవారిని సంతోషపెట్టడానికి ప్రయత్నించవచ్చును. అందరూకలసి పని జేయడం అసంభవం. ఇదివరకటిలాగ అన్నిసీట్లు కాంగ్రెసు గెలుచుకోవడంగూడా అసంభవం. కాంగ్రెసు పెద్దలు ఎన్నో తంటాలుపడి పేరుకు ఐక్యతె సాధించినా, తుమ్మెదల పూతేలాగుండే యీ ముఠాల కలయిక శాశ్వతంగాదు. పొంగి పొరలి వచ్చే ప్రజాశక్తుల చైతన్య ప్రవాహంలో ఈ ముఠాలన్నీ కొట్టుకపోవడం తథ్యం.

అయితే యీ పని దానంతటదే జరుగదు. ప్రజాద్రోహుల పతనం గావించేందుకు ప్రజలంతా పూనుకోవాలి. దొంగలు దొంగలు ఊళ్లు పంచుకున్నట్లుగా జరిగే కుట్రలను ప్రజలు గ్రహించాలి. సమయం దొరికినప్పుడు కుట్రదారులకు తగిన బుద్ధి చెప్పడానికి ప్రజలు సంసిద్ధులై వుండాలి. ఈ విధంగా ప్రజల్లో చైతన్యం అధికం గావడానికి, ప్రజా శక్తి సంఘటిత గావడానికి తగిన కృషి చేయవలసిన బాధ్యతంతా అతివాద సంస్థలపైన వుంది. అతివాద వ్యక్తుల పైన వుంది. అతివాదులంతా ఐక్యమై పనిచేస్తే ఈ యెన్నికల్లోనే కాంగ్రెసు చేసే అవకతవక పనులకు తగిన సమాధానం జెప్పవచ్చును.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణంలో

# వివాదాంశాల పరిష్కార మార్గం

కె. వి. చలపతిరావు

సర్దార్ గొల్లపూడి సీతారామశాస్త్రి గారు 36 రోజులపాటు నిరశనదీక్ష సాగించారు. సత్వరాంధ్రరాష్ట్ర నిర్మాణానికి కృషిచేస్తానని ఆచార్య వినోబాభావే గారు హామీ నిస్తూ, ముందుగా ఆంధ్రరాష్ట్ర నిర్మాణం అధికార పూర్వకంగా ప్రకటించి జనరల్ ఎలెక్షన్స్ తరువాత అది కార్యరూపం దాల్చగల చర్యలు గైకొనాలని స్వామి సీతారామ్ గారి అభిప్రాయమైనట్లుగా సదరు భావేగారు నెహ్రూగారికి తెలియజేశారు. సదరు హామీ నాధారంచేసుకుని స్వామి సీతారామ్ గారు తమ దీక్షను విరమిస్తూ అక్టోబరు రెండవ తేదీలోగానే ఆంధ్రరాష్ట్ర నిర్మాణం జరగాలని తాను కోరుకున్నట్లు వినోబాభావేగారికి తెలియజేశారట. స్వామి సీతారామ్ గారి అమూల్య ప్రాణాలు కాపాడినందుకు చాల సంతోషం. కాపాడినందుకు వినోబాగారికి ఆంధ్రులందరి ధన్యవాదాలు. అయితే వీరిద్దరి మాటలకు సమన్వయం ఎలా కుదర్చాలో తెలియనివారు సికింద్రాబాదులోని వైద్యనాథన్ గారి సలహా తీసుకోవచ్చు.

సీతారామ్‌గారి దీక్షాకాలంలో స్వామి సీతారామ్, కేంద్ర రాష్ట్రప్రభుత్వాలూ వర్గాల మధ్య పరస్పరం లాంఛన ప్రాయమైన ఉత్తర ప్రత్యుత్తరాలూ, టెలిగ్రాములూ, ఎడతెగకుండా నడిచాయి. వ్యక్తులు కొందరు ఆంధ్రదేశంలోనూ, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వ వర్గాలలోనూ పలుకుబడి సంపాదించుకోటానికి ఈ అవకాశాన్ని జాగ్రత్తగా వినియోగించుకున్నారు. స్వలాభంకోసం ఆంధ్రదేశ ప్రజల శ్రేయస్సును ఇతరుల కమ్ముకుంటున్న వ్యక్తులు బయలుదేరారు. కొందరు క్రొత్తగా దేశభక్తులైనారు. ఈ రకపు వ్యక్తులుండటం మన కివాళ క్రొత్త కాదు. ఇట్టి వ్యక్తులుంటే ఎట్టి ఒడంబడికైనా నిమిషాల్లో కుదురుతుంది. ఇట్టివారి ఆసరా చూచుకుని విభజనసంఘ నివేదికపట్ల ఆంధ్ర తమిళ కర్ణాటక రాష్ట్ర కాంగ్రెసు సంఘాలూ, మద్రాసు ప్రభుత్వమూ తమ ఏకగ్రీవామోదాన్ని తెలియజేస్తే ఆంధ్రరాష్ట్రం తక్షణం నిర్మిస్తామని పండిట్ నెహ్రూ ఆంధ్ర రాయబారవర్గానికి వాగ్దానం చేశారు. దీన్ని వాగ్దానం అనేకంటే మడత పేచీ అంటేనే బాగుంటుంది. విభజన సంఘ నివేదిక ఒక్క గూడు పుఠాణీ నిర్ణయమనీ, తమకు జరగగల అన్యాయాలకు ఆంధ్రులు తలఒగ్గేపక్షంలోనే ఒడంబడిక కుదరటానికి ఎంతో కాలం పట్టదనీ, దురదృష్టవశాత్తు ఆంధ్రజాతి నెత్తిమీదికి ఎక్కి కూర్చున్న కొందరు ఆంధ్ర కాంగ్రెసు వ్యక్తులు తప్ప ప్రముఖాంధ్ర నాయకులు చూస్తూ చూస్తూ అన్యాయానికి తలఒగ్గరనీ, పండిత నెహ్రూకు తెలియదా? తెలుసు. అయినప్పుడు అట్టి ఒడంబడిక జరిగి తీరాలనటంలో అర్థం? ఒకవేళ ఆంధ్ర, తమిళ కర్ణాటక రాష్ట్ర కాంగ్రెసు కమిటీలూ, మద్రాసు ప్రభుత్వమూ విభజన సంఘ నివేదికను ఏకగ్రీవంగా ఆమోదించినప్పటికీ, ఆంధ్ర కాంగ్రెసులో కాక ప్రజలలో అధిక బలంగల నాయక ప్రముఖులు దాన్ని ప్రతిఘటించరని గ్యారంటీ ఏమిటి? ఒకవేళ ప్రతిఘటిస్తే రాష్ట్ర సమస్య మళ్లీ మొదటికి రావలసిందేగదా! ఎలాగైనా మధ్యవర్తుల జోక్యం స్వామి సీతారామ్ గారు సూచించినట్లు తప్పనిసరి అయి తీరుతుంది. అంతేకాని ఏకగ్రీవమైన ఒడంబడిక కుదరటమనే తతంగం వృథా కాలయాపనకు తప్ప కార్యసాధనకూ, సక్రమ సమస్యా పరిష్కారానికీ పనికిరాదు. అసలు విభజన సంఘ నివేదికలోని వివాదాంశాలు ఏవిటి? ఏయే సమస్యలపై మధ్యవర్తుల తీర్పు అవసరం?

చెన్నపురి వివాదాస్పదమైన విషయం కాదు. కానక్కరలేదు కూడా. మద్రాసుపై ఆంధ్రులు తమ హక్కును వదులుకోవాలనటం ద్వారా

మనకు న్యాయంగా హక్కున్నదని జె. వి. పి. తమ రిపోర్టులో గుర్తించారు. తదితర కాంగ్రెసు నాయకులు కూడ ఆ మాటను పునరుద్ఘాటిస్తూ దాన్ని బలపరిచారు. రాష్ట్రం కోసం మనమా హక్కును ఒదులుకున్నందువల్ల వచ్చే నష్టమేమీ లేదు. ఇవాళ ప్రభుత్వంలో అధిక బలంగల తమిళులు మద్రాసును యెంత తమిళమయం చేసినప్పటికీ సరైన లెక్కలు సేకరిస్తే ఆంధ్రులూ తమిళులూ ఇంచుమించు సమాన నిష్పత్తిలో ఉన్నట్లు తేలక తప్పదు. ఆంధ్ర జనాభా సగానికి సగం ఉన్నంత మాత్రాన మద్రాసు నగరాన్ని పూర్తిగా ఆంధ్ర రాష్ట్రంలో చేర్చాలని పట్టుపట్టటం చాల అక్రమం. అలా అని, న్యాయంగా మనకు సగం రావలసి ఉన్నప్పటికీ, మద్రాసులాంటి సిటీని నడిమికి రెండుగా చీల్చాలనటం, ఎంతో తప్పనిసరి పరిస్థితుల్లో తప్ప మరీ అసమంజసం. పోతే మిగిలిన పరిష్కార మార్గం ఒక్కటే. అది బొంబాయి నగర విషయంలో అవలంబింపబడు పద్ధతి. అది మద్రాసును పరిసర ద్విభాషా ప్రాంతాన్ని కలిపి ప్రత్యేక రాష్ట్రంగా చెయ్యటమే. పార్సీలు, సిక్కులు వగైరా అల్పసంఖ్యాకులను మినహాయిస్తే బొంబాయి జనాభాలో రెండే భాషలు మాట్లాడే వాళ్లు. వారు మహారాష్ట్రీలూ, గుజరాతీలూ. మళయాళీలు, కన్నడులను మినహాయిస్తే మద్రాసులో ఆంధ్ర, తమిళ భాషలు రెండే. బొంబాయిలో ఉన్నంత విరివిగా కాకపోయినా మద్రాసులో కూడా పార్సీలు, సిక్కులు వగైరాలు లేకపోలేదు. సైజులోనూ, జనసంఖ్యలోనూ మాత్రమే మద్రాసు బొంబాయితో భేదించింది. అట్టి బొంబాయిని కాస్మాపాలిటన్ సిటీగా అగ్రనాయకత్రయం తమ రిపోర్టులో గుర్తించినప్పుడు మద్రాసును ఎందుకు గుర్తించరాదు? బొంబాయి వలె మద్రాసు కాస్మాపాలిటన్ సిటీ కాదని ఎవరేనా కుతర్కాలతో తీర్మానించినప్పటికీ ఆంధ్ర తమిళుల వైషమ్యాల విభేదాల దృష్ట్యానైనా ప్రత్యేక రాష్ట్రంగా చెయ్యటమే దాని భవిష్యత్తును నిర్ణయించటంలో ఉత్తమమైన పరిష్కార మార్గము. మద్రాసును తమిళుల కివ్వటానికి ఎప్పుడో నిర్ణయం జరుగుతుందని మాకేమీ భయసందేహాలు లేవు. మద్రాసును ప్రత్యేకరాష్ట్రంగా చెయ్యటానికి వీల్లేదని వాదించే వారికి సమాధానంగా మాత్రమే కొన్ని విషయాలను పైన పేర్కొన్నాను. కనుక ఎలా చూచినా మద్రాసుసమస్య వివాదాస్పదం కానవసరం లేదు. అంతేకాని మద్రాసును మొట్ట మొదట ఆంధ్రులు నిర్మించారని; 1639లో చంద్రగిరి రాజు ఈస్టు ఇండియా కంపెనీ వారికి దత్తం చేశారని; ఈస్టు ఇండియా కంపెనీ చేతుల్లోంచి 1746లో ఫ్రెంచివారి చేతుల్లోకి పోయి 1748లో ఫ్రెంచివారితో సంధి ఫలితంగా తిరిగి బ్రిటిషు వారి హస్తగతమయిందనీ, క్రమేణా ఆంధ్రులు ప్రభుత్వ వర్గాలలో పలుకుబడి సంపాదించి మద్రాసులో ఆంధ్రభాషా నాగరికతలను ప్రచారం చేశారని, మద్రాసు ఇంతవృద్ధిలోకి రావటానికి ఆంధ్రులే ముఖ్య కారణమని, ముతరాసు చెన్నప్పలోని "ముతరాసు" మద్రాసుగానూ, "చెన్నప్పపట్టణము" చెన్నపట్టణముగానూ కాలక్రమేణ మార్పు చెందినవని, మొదలైన పసలేని చరిత్ర కాని, పేర్లలో కలిగిన పరిణామాలు గాని మనకీనాడనవసరం. ఇక్కడ ఒక సంగతి ఉదాహరిస్తాను. [illegible] కనుక తమిళనాడుకు ఉత్తర సరిహద్దు [illegible] కావాలని ఒకానొక తమిళ నాయకుడన్న దానికి సమాధానంగా, కన్యాకుమారి వద్దనున్న వట్టూరు తెలుగుపేరు గనుక ఆంధ్రరాష్ట్రానికి దక్షిణ సరిహద్దు వట్టూరు కావాలని శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారు ఒకప్పుడు హాస్యోక్తిగా అన్నారు. చరిత్రను బట్టి, పేర్లను బట్టి, అక్కడక్కడ దొరికే శిలాశాసనాలను బట్టి, చేసే వాదం వాదంకోసమేగాని దానివల్ల ప్రయోజనం లేదు. కళ కళ కోసమే అన్నట్లుగా వాదం వాదంకోసం కాదు. వాదం కోసం చేసే వాదం ప్రకారమే వ్యవహరించదలిస్తే దక్షిణమున కన్యాకుమారి అగ్రం నుండి ఉత్తరాన అజంతా ఎల్లోరాగుహలదాకా తూర్పున కటక్ వరకూ గల ప్రాంతమంతా ఆంధ్ర రాష్ట్రాంతర్భాగమై తీరవలసిందే కదా! మెటీరియలిస్టుకు తర్కవాదం ఎంతో, భాషాసిద్ధాంతవాదికి చారిత్రికవాదం కూడా అంతే.

సరిహద్దులు: లింగ్విస్టిక్ బేసిస్‌పై భారత రాష్ట్రాల పునర్విభజన జరిగినప్పుడు ఆయా భాషాప్రాంత నాయకులతో సామరస్యపూర్వక చర్చలద్వారా గాని, బౌండరీ కమిషన్‌ను నియమించిగానీ సరిహద్దుల్ని సవరించుకోవచ్చు. ముందు ఆంధ్రరాష్ట్రం ఏర్పడితే మిగిలిన భాషా రాష్ట్రాలు ఏర్పడటానికి ఎంతో కాలం పట్టదు. ప్రస్తుతం మద్రాసు మినహాగా ఎ. పి. సి. సి. జూరిస్ డిక్షన్‌లో గల ఉత్తర విశాఖ, దక్షిణ విశాఖ, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, కడప, కర్నూలు, అనంతపురం జిల్లాలూ బళ్ళారి జిల్లాలోని ఆదోని, రాయదుర్గ, ఆలూరు తాలూకాలు కలిపి ఆంధ్రరాష్ట్రంగా నిర్మిస్తే సరిహద్దులలో ఏమైనా స్వల్పమార్పు లవసరమైతే పై చెప్పిన పద్ధతి ననుసరించవచ్చు. కర్ణాటకులు తమ రాష్ట్రంకూడ ఇప్పుడే ఏర్పడాలనీ; బళ్ళారి జిల్లాలోని ఆలూరు, ఆదోని, రాయదుర్గ తాలూకాలలో కొన్ని భాగాలూ, కర్నూలు అనంతపురం జిల్లాలలోని కొన్ని భాగాలూ తమకు రావాలని వాదిస్తున్నారు. రేపు కేరళులుకూడ కేరళరాష్ట్రాన్ని కోరవచ్చు. ఇలా ప్రతిభాషీయులూ తమతమ రాష్ట్రాలకోసం ఇప్పుడే ఆందోళన సాగించటమంటే, అసలు సమస్యనే మూలకు నెట్టటానికి కేంద్ర ప్రభుత్వానికి అవకాశ మివ్వటమన్న మాట. ఒకటి తర్వాత ఒకటి చొప్పున అన్నీ ఏర్పడవలసిందే. ఎవరూ కాదనరు. ఒక్క ఆంధ్రరాష్ట్రానికి సంబంధించిన సమస్యలలోనే కొన్నింటిని పరిష్కరించటాని కిప్పుడవకాశం లేనప్పుడు. అన్ని రాష్ట్రాలకూ సంబంధించిన సర్వసమస్యలూ ఏక కాలంలో పరిష్కరింపబడటం అసంభవం. స్వాతంత్ర్య సంసిద్ధి తరువాత కేంద్రప్రభుత్వాన్ని ఎదుర్కొన్న సమస్యలలో ఏ ఒక్కటీ సక్రమంగా పరిష్కరింపబడలేదన్నది ఇందు కుదాహరణ. ఆంధ్రనాయకులు కూడ సరిహద్దుల విషయమై అనవసరా వేశాలకు లోను కాకపోయినట్లయితే రాష్ట్రావతరణ జరిగి లక్ష్యం సిద్ధించటమేగాక మిగిలిన భాషా రాష్ట్రావతరణను కూడ దోహదం చేసినవారవుతారు. సరిహద్దుల విషయంకూడ వివాదాస్పదం కానవసరంలేదు.

పోతే రాజధాని, ఆస్తి అప్పుల పంపకం సమస్యలు. నిజానికీ సమస్యలకు సంబంధించినంతవరకు విభజన సంఘసభ్యులలో గూడు పురాణీ జరిగింది. రాజధానినికూడ ఆంధ్రదేశంలోనే వెంటనే నిర్ణయించుకోవాలని విభజన సంఘనివేదిక సూచిస్తున్నది. న్యాయదృష్టితో చూస్తే ఆంధ్రదేశంలో రాజధానికి తగిన వసతులు ఏర్పడేదాకానో, హైదరాబాదు సంస్థానాన్ని భాషాప్రయుక్తంగా విభజించేదాకానో, తాత్కాలికాంధ్ర రాజధానిని మద్రాసులో ఏర్పాటుచేసుకోటానికి తమిళులు అభ్యంతరం చెప్పటానికి కారణం కన్పించదు. ఆంధ్ర రాష్ట్రానికీ, మిగతా మద్రాసు రాష్ట్రానికీ సమష్టి రాజధానిగా మద్రాసు ఉండాలని సుమారు రెండేళ్ళక్రిందటి మద్రాసు మంత్రులు తీర్మానం చేశారు కూడా. ఒకవేళ రాజధానిని ఆంధ్రదేశంలోనే ఏర్పరుచుకోవలసివస్తే దాని నిర్ణయం కనుకపడిన రాయలసీమ నాయకుల ఇష్టానిష్టలకు ఒదిలెయ్యటం సర్కార్ల నాయకుల ముఖ్య కర్తవ్యం. ఆస్తి అప్పుల పంపకం, ఉద్యోగుల సమస్యలను మధ్యవర్తుల పరిష్కారానికి ఒదిలెయ్యటం అవసరం. "మద్రాసుపై ఆంధ్రుల హక్కు" విషయమై మాత్రం మధ్యవర్తుల జోక్యాన్ని సహించమని కుమారస్వామిరాజా గారు అన్నారుట మనం ఆహక్కును ఈనాడే కాదు, ఏనాడో ఒదులుకున్నాం. కనుక ఇతర సమస్యలపై మధ్యవర్తుల తీర్పుకు తమిళులు అభ్యంతరం చెప్పరని దానివల్ల అర్థమౌతున్నది. ఆంధ్ర, తమిళ, కేరళ, కర్ణాటక భాషా ప్రాంతాలు గల మద్రాసు రాష్ట్రంనుండి ఆంధ్ర భాషా ప్రాంత మొక్కటే విడిపోయే ప్రశ్న మాత్రమే తలయెత్తిన ఈ తరుణంలో మద్రాసు విషయమైగాని, సరిహద్దుల విషయమైగాని అనవసరమైనట్టి, రాష్ట్రావతరణకు తీవ్రాటంకం కాగలిగినట్టి కొత్త సమస్యల్ని సృష్టించుకో కూడదు. విభజన సంఘ నివేదికలో కూడ ప్రాంతాలకు సంబంధించిన వివాదాలు లేవు. రాయలసీమ నాయకులు కూడ లేనిపోని భయసందేహాలకు గురికాకూడదు. ఇటు సర్కార్ల నాయకులు కూడా, ఆంధ్ర రాష్ట్రావతరణ తరువాత రాయలసీమ జిల్లాలు సర్కారు జిల్లా

అలో అన్ని రంగాలలోనూ సమానాభివృద్ధి పొందేనాకు రాయలసీమ నాయకులు తమ ఇష్టంవచ్చిన విధానాలను అవలంబించటంలో అడ్డు చెప్పకూడదు.

ఏది ఏమైనప్పటికీ ప్రస్తుత పరిస్థితుల్లో స్వామి సీతారామ్‌గారు ఆంధ్ర జాతిని గాఢ సుషుప్తినుండి మేల్కొల్పినందుకు వందనీయులు. మళ్లీ కునికిపాట్లు రాకముందే (ఈ వేడి చల్లారకముందే) రాష్ట్రనిర్మాణం జరగాలి. వినోబాజీ, నెహ్రూజీల హామీల మీద ఆధారపడి ఊరుకోకూడదు. వివిధాంధ్ర రాజకీయ పక్షాలు మరొకమారు స్వామి సీతారామ్ గారి అధ్యక్షతన సమావేశమై ఒక గడువును నిర్ణయించి, ఆ గడువులోగా రాష్ట్రనిర్మాణం జరిగి విభజన సంఘ నివేదికలోని ఆస్తి అప్పుల పంపకంలాంటి సమస్యల పరిష్కారానికి నిష్పాక్షిక ట్రిబ్యునల్ నియమించబడని పక్షంలో రాష్ట్ర వ్యాప్త సత్యాగ్రహోద్యమం తప్పనిసరి కాగల పరిస్థితులు ఏర్పడగలవని కేంద్ర ప్రభుత్వానికి స్పష్టంగా చెప్పెయ్యాలి. ఏ పటి చర్యకు యావదాంధ్రుల్ని సంఘటితపరచి సర్వసంసిద్ధులుగా చేసే బాధ్యత కూడ వహించాలి.

రాష్ట్ర నిర్మాణం జరిగేలోగా మామూలు అడ్మినిస్ట్రేటివ్ కార్యకలాపాలు తప్ప, ఆంధ్రదేశానికి సంబంధించినంతవరకు ఆంధ్రుల ఇష్టానిష్టాలతో పనిలేకుండా ఏ విధమైన ప్రణాళికలూ అమలు జరుపబడదనీ, దాని సంపూర్ణ బాధ్యత తామే వహించవలసి ఉంటుందనీ, రాష్ట్ర ప్రభుత్వాన్ని హెచ్చరించటం మాత్రం మరచిపోకూడదు.

# కసుగందుల క్రమాభివృద్ధి

గుంటుపల్లి రాధాకృష్ణమూర్తి

జీవానికి పెరుగుదల శక్తి ఉంది. జీవం పెరుగుతుంది, పెద్దదౌతుంది. విభజన క్రమంవల్ల ఒక్క జీవాణువులో నుంచి, ఒక ఆకృతిగల వస్తువు తయారవుతుంది. ఆ వస్తువే పసి పాపాయి. ఆ పాపాయి పెరిగి ఒక మనిషిగా వృద్ధిపొందుతుంది. శరీరవృద్ధి దశలలో మనోప్రవృత్తి వికసిస్తుంది. పిల్లల పెంపకంలో మనం సాధారణంగా మనస్సు గురించి, మనో వికాసాన్ని గురించి ఆలోచించం. కడుపు నిండా పాలిచ్చి ఉయ్యాల్లో పడేస్తే పాపాయి పాటికి పాపాయే పెద్దదౌతుంది, అని ఊరుకుంటాం. పిల్లల పెరుగుదల దశల్లో తల్లిదండ్రులు గమనించవలసిన ముఖ్య విషయాలు ఎన్నో ఉన్నాయి.

పిల్లల మనస్సు కరిగిన సీసంలాంటిది. అది ఎటుతిప్పితే అటు తిరుగుతుంది. దానికి ఏ ఆకృతి దిద్దితే, ఆ ఆకృతిని సులభంగా పొందుతుంది. మనిషి ప్రవర్తన అలవాట్లమీద ఆధారపడి ఉంటుంది. పసితనంలో ప్రస్ఫుటమైన అలవాట్లు ఏర్పడి ఉండవు కాని, ఏర్పడగలవు. అసలు అలవాటు అంటే ఏమిటి? అలవాటు దైనందిన క్రమంవల్లగాని, స్వతస్సిద్ధంగా గాని ఏర్పడ్డ వ్యవస్థ. ఇది మనిషి ఆర్జించుకున్నది. ఇది శారీరకమైనా కావచ్చు, మానసికమైనా కావచ్చు. ఒక చిన్న ఉదాహరణ. రోజూ ప్రొద్దున్నే ఆరుగంటలకు కాఫీ సేవించటం అలవాటు. ఇది అభ్యాసక్రమంవల్ల ఆర్జితమైన లక్షణం. మనిషి కాఫీ అలవాటుతో పుట్టలేదు. ఈ అలవాటు మనిషి ఆర్జించుకున్నది. అలవాటుకు మరొక ప్రస్ఫుటమైన గుణంకూడా ఉంది. అలవాటుకు జాగ్రదవస్థ అక్కర్లేదు. అది మనిషికి తెలియకుండానే జరిగిపోతుంది. తను కాఫీ తాగుతున్నానని తెలుసుకోకుండానే కాఫీ తాగుతాడు. ఈ లక్షణం వల్ల మనస్సుకు కొంత విశ్రాంతి లభిస్తుంది. సామాన్యంగా మనిషి దైనందిన క్రియలన్నీ అలవాట్లవల్లనే జరిగిపోతున్నాయి కాని, ఎప్పుడైనా ఒక కొత్త సమస్య ఏర్పడితే, దాన్ని అలవాటు పరిష్కరించలేదు. దానికి మనిషి తన తెలివితేటల్ని ఉపయోగించవలసిన అవసరం వస్తుంది.

పసిబిడ్డల మనసు సలిలంలాంటిది. నీరు ఎలా పాత్రఆకృతిని పొందుతుందో బిడ్డలశీలం అలాగే

షమా? సాధారణంగా అంతా అబ్బాయి బళ్ళో ఫస్టుగా ఉండాలనీ, బహుమానాలూ ప్రశంసలూ పొందాలనీ కోర్తారు. జీవితంలో విజయం చేకూరటానికి మానవ ప్రయత్నానికి తోడు అవకాశాలు కలిసి రావటం కూడా ఉండాలి. ఏదో ఖర్మ కాలక అబ్బాయి ఫెయిలవుతాడు. తల్లిదండ్రులు వాణ్ణి తిడతారు. వాడు ఆవేదనం పొందుతాడు. చదువంటే ఒక పెను భూతంగా భావించి, వాడు చదువును తప్పించుకోటానికి మార్గాలు వెతుకుతాడు. ఇటువంటి పౌరులు తయారైతే ఆత్మకూ, జాతికీ కూడా హానికరమే. కాని, తల్లిదండ్రులు నిష్ఠ వికాసాన్ని గనక వాంఛిస్తే వాడు అఖండమైన తెలివి గలవాడు కాకపోవచ్చును. గాని, వాడిని చూసి సంఘం తలవంచుకోవలసిన అవసరం ఉండదు.

ముద్దా? చనువా?

లేక లేక పుడితే తల్లిదండ్రులు పిల్లల్ని అల్లారు ముద్దుగా పెంచటం కద్దు. ఇది పిల్లలకు శ్రేయోదాయకం కాదు. శిక్ష, చనువు మితమైన తర్ఫీదు పిల్లలకు అవసరం. డిసిప్లిన్ పిల్లలకు ముఖ్యం. పిల్లలందరూ నియమాలను పాటించాలి. నియమాతిక్రమణకు తల్లిదండ్రులు శిక్ష విధించాలి. పిల్లలు తప్పులు చేస్తారు. ముద్దు కోసం పెద్దలు అవి చూస్తూ ఊరుకోకూడదు. వారిని దిద్ది, సన్మార్గంలో పెట్టాలి. ఎప్పటికీ మితిమీరిన ముద్దుకంటే భయభక్తులతో కూడిన చనువు చాలా మంచిది.

అధికారమా? స్వేచ్ఛా?

పిల్లలు కేవలం మూఢులని భావించి, వాళ్ళ ఇష్టాయిష్టాలను పరిగణించక, అధికారం చలాయించకూడదు. వాళ్ళకు స్వేచ్ఛ ఉండాలి. వాళ్ళ ఇష్టాలను కూడా జాగ్రత్తగా చూడాలి. ఈ విషయంలో సాధారణంగా అందరిండ్లలో జరిగే ఉదాహరణ, అబ్బాయి ఆప్షనల్ కెమిస్ట్రీ తీసుకుంటానంటాడు. వాళ్ళ నాన్న "వెధవా, నీకేం తెలుసు? లెక్కలు తీసుకుంటే ఉత్తరోత్తరా అన్నింటికీ మంచిది." అని చెప్పి పిల్లవాడి భవిష్యత్తును తన చేతుల్లోకి తీసుకుంటాడు. దీనివల్ల తండ్రికంటే తను లోకువైనట్లూ, తనకు స్వేచ్ఛ లేనట్లూ అనుకుని పిల్లవాడు "చదువు ఎందుకొచ్చిన తిప్పలురా?" అని అనుకుంటాడు.

అనుకరణమా? వ్యక్తిత్వమా?

పిల్లలు తండ్రినో, తాతనో, లేక మరొక పెద్దమనిషినో అనుకరించాలని చెప్పటంకన్నా, "నువ్వూ ఒక మనిషివి; నువ్వూ ఒక మేధావివి;" అని వాడి వ్యక్తిత్వాన్ని రెచ్చగొట్టి, "నువ్వెంత పని చెయ్యగలవో చూద్దాం కానీ" అని ప్రోత్సహిస్తే, ఆ పిల్లలకు ఉత్సాహం కలుగుతుంది.

నిరాదరణమా? ప్రేమా?

కొందరు తల్లిదండ్రులు పిల్లలను గురించీ, మనస్తత్వాలను గురించి తెలీక, పెద్దలతో జోక్యం కలిగించుకోకూడదని, పిల్లల్ని దూరంగా ఉంచుతూ ఉంటారు. దీనివల్ల పిల్లలకు నిరుత్సాహం తప్ప మరొక ప్రయోజనం ఉండదు. ఎంత చేసినా తల్లిదండ్రులు ఎలాగూ మెచ్చుకోరు గదా అని, అసలు విధినే నిర్వర్తించటం మానేస్తారు. అట్లా కాకుండా, పిల్లలు బాగా ప్రవర్తించినప్పుడు మెచ్చుకుంటూ, ప్రేమతో వాళ్ళని ప్రోత్సహిస్తూ, చదువులో గాని, ఏ ఇతర రంగంలో గాని తృప్తికరంగా లేకపోయినప్పటికీ నిరుత్సాహపరచకుండా "ఇకనైనా జాగ్రత్త సుమా!" అని హెచ్చరిస్తూ ఉంటే పిల్లల మనస్సు వికసించటానికి అవకాశాలు ఉంటాయి.

పిల్లలు తల్లిదండ్రుల ప్రేమకూ, విశ్వాసానికీ, ప్రశంసకూ పాత్రులనీ, ఇంట్లో తల్లిదండ్రులకు నమ్మకమూ, గౌరవమూ ఉన్నదనీ, తాము లేక కుటుంబానికి నిండుతనం లేదనీ గ్రహించాలి. తల్లిదండ్రులు భావాలను వట్టి మాటలతో వెలిబుచ్చక, కార్యరూపంలో తమ ప్రేమను చాటటం ఉత్తమం. పిల్లలు ఇంటి నిండా గలగల మంటుంటేనే ఇంటికి కళ అనీ, సంసారానికి సంపూర్ణత అనీ, మనస్సులకు ఆనందమనీ అటు తల్లిదండ్రులకూ, ఇటు పిల్లలకూ తెలియాలి.

నేడు తాము పెంచే పిల్లలే రేపు వాళ్ళ పిల్లలను పెంచుకోవలసిన వారనీ, అందుకుగాను వాళ్ళకు తాము మార్గదర్శకులు కావాలనీ, గుర్తించి, తల్లిదండ్రులు శిశుశిక్షణా భారాన్ని జాగ్రత్తగా నిర్వహించాలి.

కథానిక

# సరికొత్త పాతకథ

ఏ. వి. నరసింహారావు

చంద్రుడు లేని నల్లటి ఆకాశంలో తెల్లగా మెరుస్తున్నాయి నక్షత్రాలు. ఎదురుగా వున్న కోవెల మండపం మీద గుడ్లగూబ కూస్తోంది. బయట పొలాల్లో నక్కలు శక్తి కొలదీ అరుస్తున్నాయి. అప్పుడే భోజనం ముగించి వీధిలోనికి వచ్చిన నాదృష్టి సరాసరి మా యింటికి ఎదురుగా వున్న మా మాళ్ళ సావిడిమీద పడింది. గాలిలేక ప్రశాంతంగా వుండటంచేత సావిడి అరుగుమీద వున్న దీపం ఆకాశంలోని నక్షత్రంవలె మెరుస్తోంది. ఎవరైనా దారిన పోయేబాటసారులు బసచేశారనుకున్నా. "తాగనాకి కడుపునిండా గంజేనా లేదు. ఈవారం బత్తెం మొన్నటితో సరి అయిపోయినాది. ఎల్లుండి దాకా కామందులు గింజలు కొలవరు. సందాల దాకా మాళ్ళతో సహా చేలనక, పుట్టలనక తిరిగొస్తే గుక్కెడు అంబలి తప్ప ఏమీ లేదు. ఒకడి సంపాదనమీద ముగ్గురు బతకాలంటే ఎలా గడుస్తుంది!" అని సణుగుకొంటూన్న మా పాలికాపు అప్పిగాడి గొంతుక వినబడింది.

మొన్న నేను వేసంగి సెలవలు అయిపోయి వెళ్ళేవరకూ గూడ వాళ్ళ గూడెంలోనే నివసించిన మన అప్పిగాడి కుటుంబం సావిడి అరుగుమీదకు మారడానికి గల కారణాన్ని వూహిస్తూనే అరుగుదిగి సావిడివైపు నడచాను. ఇదివరకు ఆ కుటుంబంలో అప్పిగాడు అనే పేరుతో మా మాళ్ళను కాస్తూన్న పది, పదకొండేళ్ళ కుర్రాడితో తప్ప మరెవరితోటీ నాకు పరిచయం లేదు. ఇదివరకే వాడి కుటుంబ చరిత్ర తెలిస్తే వాడిని చరితార్థుణ్ణి చేసేవాడిని. వెంటనే ప్రశ్నించాను.

"ఏంరా అప్పిగా! ఈ అరుగుమీద వుంటున్నారేం?"

మూకుడులో వున్న అంబలి నసుకుంటూ రెండుచేతుల్లోటి ఎత్తి, నోట్లో పోసుకొని, తేనుపుకూడా అయిపోయిన తరువాత జాలిగా నాకేసి చూస్తూ సమాధానమిచ్చాడు:

"సుబ్బిగాడు చేసిన దొంగతనాలంటినీ, చిన్నాన్నగారితోటి మేమే చెప్పేమని, సుబ్బిగాడూ, మిగతా మా కులంవోళ్ళు మమ్మల్ని గూడెంలోంచి వెళ్ళగొట్టించేశారండి" అన్నాడు.

"సుబ్బిగాడు మన పనిలోనికి రావటం లేదా?" అన్నా.

లేదన్నట్లు తల వూపుతూ "చిన్నాన్నగారే మానేయమన్నారండి" అని జవాబు చెప్పాడు.

మానేయమనక ఏంచేస్తాడు? అటువంటి వాడు ఒకడు, ఒకటి రెండేళ్ళు కమతంలో వుంటే, యింట్లోవుండే గునపాలు, పారలు మొదలైనవి వాటంతట అవే మాయమవుతాయి. సావిడ మిద్దెమీద వున్న నులకే గాకుండా, వెదుళ్లు కూడా విమానాల్లాగ రాత్రికి రాత్రే ఎగిరిపోతాయి. మాళ్ళన్నీ సమృద్ధిగా తింటూన్నా మూడునెలలుదాకా తరగని గడ్డి మేట్లు మూడురోజులకు కూడా చాలవు. పెళ్ళిళ్ళు కార్యాలూ అయినప్పుడు యింటికి వచ్చిన చుట్టాల జోళ్ళు గుమ్మందగ్గిరవి గుమ్మందగ్గరే మాయమవుతాయి. ఇవాళ పెద్దవిగా కనిపించిన పుల్లల గుట్టలు, రేపటికే సగం తరిగిపోయినట్లు అగపడతాయి. ఇలాంటి కృత్యాలు జరిగినప్పుడు మొదట్లో మాకు ఆశ్చర్యంగానే వుండేది. రానురాను మా యింట్లో అందరికీ సుబ్బిగాడిమీద అనుమానంగావుండేది. అది మొన్న నేను పట్నాం వెళ్ళినపుడు అప్పిగాడి సాక్ష్యంవలన ఋజువయియుంటుంది. అందుమూలంగా సుబ్బిగాడు కమతం మానివేయడం, అప్పిగాడి కుటుంబం సావిడి అరుగు

మీదకు మారడం ఒకేసారి జరిగివుంటాయి.

అసలు సంగతి చెప్పడం మరచిపోకూడదు. ఇందాకటినుండీ అప్పిగాడి ప్రక్కనే కూర్చొని, యిప్పుడు వాడు తినేసిన మూకుడులో అంబలి తాగుతోంది, వాడి చెల్లెలే అనుకుంటా. కాని నా సందేహాన్ని తీర్చుకోవడంకోసం వెంటనే ప్రశ్నించాను.

"ఈ పిల్లెవర్రా?"

"మా చెల్లేనండి. మంగమ్మ" అని నోటిలోని చుట్ట తియ్యకుండానే జవాబు చెప్పాడు.

ఇంతట్లో ఒక ఎర్రని పొడా ఎత్తుమనిషి, ఒక కర్రని వూతగా కుంటుకుంటూ వచ్చాడు. మొహంలో అప్పిగాడి పోలికలు చాల అగుపడుతున్నాయి. చాలా నీరసంగా వున్నాడు. ఎముకలు పైకి కనపడుతున్నాయి. కొంచెం తలమీద వెంట్రుకలు నెరసినా వడివయస్సు వాడనే చెప్పాలి. తన శక్తికిమించిన వెలుతురిని ఆముదం దీపం యివ్వలేదు కొబట్టి వాడు కుంటడానికి గల కారణం వాడే చెప్పేదాకా నాకు తీరని సమస్యఅయి నిలిచింది. "ఏంరా బాబా! ఇంతసేపూ బయలుభూమికి వెళ్లడమేనా" అని అప్పిగాడు వేసిన ప్రశ్న ఈ కుంటిమనిషి అప్పిగాడి తండ్రి అవునా, కాదా అన్న నా సందేహాన్ని తొలగించింది. ఒకగంట క్రితం "ఒకడి సంపాదనమీద ముగ్గురు బ్రతకాలి" అని అప్పిగాడు అనడం మరచావనుకుంటా.

"మీఅమ్మ కనబడదేంగా?" అని అడిగాను.

అప్పిగాడు వినబడీ వినబడనట్లు వూరుకొన్నాడు.

కాని వాడి తండ్రి మాత్రం "అగుంటే మాకీపంచలని తేకేగతి ఎందుకు పడుతుందండి" అంటూ, చేతికర్రను అవతలకేసి అరుగుమీద చతికిలబడ్డాడు.

నేనుగూడ కూర్చుంటూనే "చచ్చిపోయినదా? ఎప్పుడు? పాపం!" అన్నాను.

"చచ్చినా శని విరగడవునండి" అంటూ ఏదో చెప్పబోయి మానేసినట్లగపడ్డాడు. తరువాత నా కోరికమీదే, ఈ క్రింది విధంగా చెప్పడం మొదలెట్టాడు.

"నా జీవితంలో కష్టమంటే ఏమిటో తెలియనటువంటి రోజులవి. నేనప్పుడు పట్నంలోవున్న మిల్లులో పనిచేసేవాణ్ణి. నెల అయేసరికి నలభై రూపాయలు చేతికొచ్చేవి. హాయిగా ఖర్చుపెట్టుకొనిపిల్లలూ, భార్యా, నేనూ సుఖాన్ని అనుభవించేము. అప్పుడు అప్పిగాడు అయిదేళ్ళవాడు. మంగమ్మకు ఒక సంవత్సరం నిండింది. తెల్లారి అయేసరికలా మిల్లుకూత వినగానే చద్దిగంజి తాగేసి పనిలోకి పోయేవాణ్ణి. పన్నెండు అయేసరికి యింటికివచ్చి మధ్యినం కూడుతిని ఒకగంట కునుకోయేవాణ్ణి. మళ్ళీ రెండు గంటలకి వెళ్ళి, ఆరయేసరికి కొంపచేరేవాణ్ణి. మీ దయవల్ల పాటడుతే కూటికి లోటెందుకుంటుందండి? అప్పిగాడు కూడ పెద్దయ్యేక నాలాగే మిల్లులో పనిచేస్తాడనుకున్నా. పెద్ద పిల్లలిద్దర్నీ పల్లెల్లో కూలిపని చేసేవాళ్ళకే యిచ్చేనుగదా, మంగమ్మనైనా బస్తీలో ఏ మిల్లులోనో పనిచేసేవాడికి యిద్దామనుకున్నా. కాని నా ఆశలన్నీ యిలా బూడిదలో కలుస్తాయని ఎరికి తెలుసునండి? తానోటి తలస్తే దైవమోటి తలచినట్లయిందండి" అంటూ కళ్ళవెంబడి నీళ్లు కార్చడం మొదలెట్టాడు, నా సానుభూతికోసం ఎదురు చూస్తున్నవాడిలా.

అసలు జరిగిన విషయమేమిటో తెలుసుకోకుండా సానుభూతి చూపడం నా ఒక్కడికే కాదు, ఎవరికైనా కష్టదాయకమే! కాని సానుభూతి చూపితేనే గాని తరువాత కథ చెప్పేటట్లు లేడు. వాడు కళ్ళనీళ్ళను కార్చ

డాన్ని బట్టి ఏదో భయంకర సంఘటన జరిగిందనుకోవాలి. "సరే! నీ మనస్సుకు అంతకష్టమయిన సంగతి ఏమి జరిగింది?" అని ప్రశ్నించాను ప్రేమగా.

"నే నావేళ లేస్తూనే ఏరి పాడు మొగం చూశానో చెప్పలేను. మామూలుగానే చద్ది గంజి తాగి పనిలోకి పోయే. అంత క్రితం రాత్రి, తేలు కుట్టడం వల్ల నిద్రను మర్చిపోయి తెల్లవార్లూ బాధపడ్డా. అందుచేత మత్తుగా చద్దిగంజి తాగానేమో పనిచేస్తూంటే కునుకుపాట్లు వచ్చాయి. కునుకుతూ కునుకుతూ వేగంగా తిరిగే చక్రంలో పడిపోయాను. అదృష్టమో, దురదృష్టమో చెప్పలేనుగాని నా కాలొకటే చక్రంలో పడి నలిగిపోతుంటే తోటి పనివాళ్ళు చూసి యింజను ఆపుజేశారు వెంటనే. ఎడం కాలి పాదం అంతా పిప్పి పిప్పి అయిపోయింది. వైద్యం చేయించమని యజమానిని ఎంతో వేడుకున్నా. కాని లాభం లేకపోయింది. అందరూ ఒకలాగే వుంటారా? నేను పిడతలో జాగ్రత్త చేసిన డబ్బు పదిహేను రూపాయలుంటే అవితీసుకెళ్ళి నా పెళ్లాం నేనూ డాక్టరు కాళ్ళమీద పడ్డాం. ఆయన చాలా మంచివాడు. ఒక యిరవయి రోజులలో నా జబ్బ మాన్పాడు. పాదం వంకర పోవడమే గాకుండా వేళ్ళన్నీ నాశనమయాయి. ఒక కర్రని ఆధారంగా చేసుకొని కుంటు కుంటూ మా యజమాని దగ్గరకు వెళ్ళే. కుంటివాడ్ని పనిచేయలేనని వుద్యోగంలోంచి తీసేసేన్నాడు. గేటు దగ్గర పనేనా యిప్పించమని చాలాసేపు వేడుకున్నా ఫలితం లేకపోయింది" అంటూ నిట్టూర్చాడు.

నా గుండెలో పెద్దరాయి పడినట్లయింది. పావడి దొడ్లో తాటిపండు పడిన చప్పుడు. అంత గాఢ నిద్రలోవున్న మంగమ్మ లేచి, ఒక చిటికలో కల్లా ఒక నల్లని పెద్ద తాటిపండుని చేత్తో పట్టుకొని వచ్చింది. మిగిలిన రెండు టెంకల్ని నా ప్రక్కనున్న తాటాకు మీద పెట్టి, తన భాగానికి చెందిన టెంక నొకదాన్ని రెండు చేతుల్తోటీ పట్టుకొని పళ్లతో పీకడం మొదలెట్టింది పాపం! అంత క్రితం తాగిన అంబలితో సంతృప్తిపడి వుండదు. ఆకలికి ఆగలేక రోజూ మంగమ్మ ఈ కార్యక్రమానికి అలవడిందనుకున్నా.

వస్తూ వస్తూన్న నిద్ర ఆపుచేసుకుంటూ అప్పిగాడి తండ్రి చెప్పడం సాగించాడు. "నేను కుంటివాణ్ణయి పోయాను గదా తనకు తగిన భర్తను గానని, అప్పిగాడినీ, మంగమ్మనూ, నా దగ్గర విడిచిపెట్టి, ఇంకొకడితో రాత్రి రాత్రే లేచిపోయింది నా భార్య. వేరే గతిలేక ఈ వూళ్ళో వున్న కూతురు దగ్గర కొచ్చేశా. అదు క్కుంటూనో, మొత్తుకుంటూనో ఒక అయిదేళ్లు పోషించిందండి మమ్మల్ని. తరవాత దానికీ మాకూ పడలేదండి. ఒక సంవత్సరంపట్టి అప్పిగాడిని తమ కవతంలో పెట్టి వాడి సంపాదన మీదే బతుకుతున్నాము. మొన్న వాళ్ళ గూడెంలోంచి వెళ్ళిపొమ్మంటే, చిన్నాన్న గారి అరుగుమీద వుండమన్నారు. ఏదో మీ దయవల్ల ఒకపూటేనా కడుపునిండా గంజి తాగుతున్నామండి. ఇక నాకూ, నా పిల్లలకూ పరవాలేదండి" అని తన ధైర్యాన్ని వెలిబుస్తూ కథ ముగించాడు.

నేను అరుగుదిగి పోబోతూంటే "అప్పిగాడికి ఒక పాత-చొక్కా వుంటే దయ చేద్దురూ? వచ్చేది చలికాలం" అన్నాడు దీనంగా. "అలాగేలే" అని మా యింటిలోకి పోయి వీధితలుపు వేసుకొని పడుకున్నా. కాని నిద్ర పట్టలేదు. వింతఅయిన ఆలోచనలు మనస్సులో ప్రయాణం సాగించాయి. అప్పిగాడి తల్లి పట్టణంలో ఎక్కడ వుంటుంది? రమ్మని చెబితే వస్తుందా? అది వస్తే అప్పిగాడి తండ్రి రానిస్తాడా? ఒకవేళ వాడు రానిస్తే వాడి కులంవాళ్ళు వూరుకుంటారా? రాత్రంతా ఈ విధమైన ఆలోచనలతోనే గడిచింది. తెల తెల్లారుతుంటే నిద్రపట్టింది గాని, అప్పిగాడు వాకలి ఊడుస్తూన్న చీపురు శబ్దానికి లేచి పోయాను.

---

యుద్ధంలో మానవులు పరస్పర శ్రేయస్సు కోరి ఏవిధంగా తమ ప్రాణాలు అర్పిస్తున్నారో- అలాగే శాంతికాలంలో కూడా కలసి మెలసి, పరస్పరోపకార బుద్ధితో జీవించే పద్ధతి మనం అలవరచుకోవాలి—జెనరల్ ఓమర్ బ్రాడ్లీ.

# కాంగ్రెసు - ముస్లిములు

"టి. యల్. యన్."

ఈనాడు మన దేశవాతావరణంలో అత్యంత ప్రోత్సాహకరమైన మార్పులు సంచరిస్తున్నాయి. నాయకుల ఉపన్యాసాల వల్ల అది "ఒక ముఖాన కాక అనేక ముఖాల" అని కూడా తోస్తోంది. సత్వర ఎన్నికల అనంతరం ఆంధ్రరాష్ట్ర సిద్ధి నిశ్చయం, సత్యం అని కొందరైనా భావిస్తున్నారు. నెహ్రూ కాంగ్రెసు అధ్యక్షపీఠాన్ని కూడా వశం చేస్తూండడాన కాంగ్రెసుకు చాలా కాలంగా పట్టిన 'పాచిబట్టలు' పటాపంచలైనట్లు భావించేందుకు అవకాశం వచ్చింది. మాకుమిక్కిలి మనప్రక్కన నివసిస్తూన్న ముస్లిం సోదరులు ఈనాటికైనా కంపు తెంచి మతరాజకీయాలను విడనాడి (?) కాంగ్రెసుతో కలుస్తామనడంతో బాపూజీ కన్నకలలు రూపొందబోతున్నాయా అని ఒక క్షణాన గాకపోతే మరొక క్షణాన అనుకోడానికి అవకాశం వచ్చింది (?) "కాంగ్రెసు" పత్రిక వ్రాసినట్లు వారి ఈ నిర్ణయం "ముదావహం, సముచితం, తక్కిన ముస్లిములందరికీ శిరోధార్యం."

మొన్న ఆమధ్య (సెప్టెంబరు 7వ) మద్రాసు పాత "లీగు" ముస్లిములందరూ వారి "భవితవ్య నిర్ణయానికి" మద్రాసులో సమావేశమైనారు. వారి నిర్ణయం అత్యంతప్రాముఖ్యం వహిస్తోంది. భారతదేశాన్ని ఒర్చి పిప్పిచేసి, ఖండఖండాలు చేసి, మహాత్ముని బలిదానానికి కారణభూతమైన ఒక ప్రముఖసమస్యకు పరిష్కారం వారి కిందనాలి. ఈ సమయంలో వారి చిత్తశుద్ధిని శంకించడంగాని, మరి యితరంగాని (సభాధ్యక్షులు హమీద్‌ఖాన్ అన్నట్లు) సమంజసము కాదుగాని పూర్వాపర విచారణతో పరిశీలించుకోవడం మాత్రం తప్పకాబోదు. పైగా అవసరం కూడాను. అట్లని మృతితుల్యమైన తమోమయచరిత్రభాగాన్ని తిరుగ వేయబోవడంలేదు.

వారి ప్రధాననిర్ణయం తక్షణం కాంగ్రెసులో చేరడం. ఈనాడీ నిర్ణయం చేయడానికి కారణం ఏమిటి? ఏనాడో ఎందుకుచేసియుండరాదనేది పామరుడి ప్రశ్న. కాంగ్రెసులో ఏమైనా మార్పు (మతదృక్పథంలో) వచ్చిందా అంటే అదీలేదు. అది ఏనాటినుంచో మత తత్వ ప్రాధాన్య రహిత రాజ్యాంగాన్నే కోరుతూ వచ్చింది. ఇక రాగాపోగా రాబోయే ఎన్నికలదృష్ట్యా మాత్రమే ఐఉండాలి. ఇది మనం అనుకునే మాటగాదు. సభాధ్యక్షుడు తన పదాల్లో ఇరికించి ఉంచిన భావమే. "...ఏదోఒక పార్టీలో చేరాలి కనక, కాంగ్రెసే సౌష్టవంగా ఉంది కనక - అందులో కొన్ని విభేదాలున్నా .." ఇదీ ధోరణి. ఎంత స్వార్థపూరితంగా ఉన్నది! ఇంత తాత్కాలికమైన వారి కలయిక కాంగ్రెసుకు ఎంతప్రయోజనకారి? కాంగ్రెసు టిక్కెట్లమీద గట్టి లెక్క పెద్దలు ఎక్కువమందే ఉండవచ్చు గాని, వారందరూ తత్వంలో మాత్రం పూర్తి కాంగ్రెసువారు కారు. ఏనాడైనా చీలిక తథ్యం అంటే తప్పా? ఈ అభిప్రాయానికి అనేక సందర్భాల్లో బలం చిక్కుతోంది.

"ఒక ప్రత్యేక రాజకీయపక్షాన్ని ఎన్నికలలో బలపరచినా ముస్లిం లందరూ ఒక సంఘంగా ఉండాలి"—ఇది అధ్యక్షోపన్యాస భాగం. ఇందలి ఆంతర్యం గాని, అవసరం గాని అనూహ్యంగా ఉన్నది. ఈ దృక్పథానికి గల ప్రాతిపదిక ఏమో?

మరొక తీర్మానం "నెహ్రూ అఖండభారత దేశభక్తుడు. అతని త్యాగాలు అనన్యాలు. ప్రపంచ నాయకుడు కనుక నెహ్రూను బలపరచాలి" మంచిదే. పూర్వం మాత్రం అతడల్లాంటివాడు కాడా? నెహ్రూయే లేనినాడు వీరి ఆట ఏనాడో కట్టి ఉండేది. అది వారికి ఆనాదినుండి తెలుసు. "అయినా సమయంలో పొడిచేస్తే చాలు" అని యెన్నికముందు ఈ బాణి యెత్తారేమో అనవచ్చు.

విచిత్రమేమంటే, నెహ్రూను ఇంత పై

కెత్తినా నెహ్రూ సిద్ధాంతాలనుగాని మరి యితరాన్నిగాని మనస్ఫూర్తిగా కనీసం పైకైనా ఒప్పుకుంటారా అంటే అది శూన్యం. నెహ్రూకు "ఇండియన్ కల్చర్" వినా మరి ఇతరంలో విశ్వాసం లేదు. మరి హమీద్ ఖాన్ గారు (అధ్యక్షుడు) మొన్న 17వ తేదీన మాట్లాడుతూ ముస్లిం సంస్కృతి సభ్యతలకు గాను వేరే సంస్థల నూదించాడు. అదేమిటి?

ఇక పాఠశాలల్లో ఇస్లాం మతబోధ జరగాలని కోరడం, తదితర విషయాలు ప్రసక్తికి తేవడం అనవసరం.

వివరణ అనవసరమైన ఒక వాక్యం—"దేశకాలపరిస్థితులనుబట్టి ముస్లిములు వ్యవహరించాలి. సభవారు చేసిన నిర్ణయాలపట్ల కొంత వ్యతిరేకత (?) గావచ్చును". ఇదీ హమీద్ ఖాన్ తుది పలుకు. ఇక వీళ్ళను అవకాశవాదులంటే తప్పిదమా?

(ఇంతకూ ఇంతటి "ఉదార తీర్మానాలు" చేసిన ఈ సభకు పత్రికా విలేఖరులకైనా ప్రవేశం లేదట!)

మరొక విచిత్రమేమిటంటే ప్రముఖ ముస్లిము నాయకుడుగా చెలామణి పోతున్న ఈ హమీద్ ఖాన్ గారే భారతదేశాన్ని ఎందుకు సేవించాలి అనే దానికి కారణాలు చెప్పారు. తల్లిని సేవించడానికి గౌరవించడానికి ఏం కారణాలు ఉంటాయి? ఆమె తల్లి కనుక సేవించాలి అంతే. అప్పుడే అది స్వాభావికం. కాని ఖాన్ గారు "మనం ఇండియాను మాతృదేశంగా ఎన్నుకున్నాం గనుక (అంటే వీరు స్వాభావికపుత్రులు కారని వారి వాదనా?) భారతదేశంలో కొన్ని బాధ్యతలు వేసుకుంటాం" అని అంటున్నారు. మొన్న 12వ తేదీన మద్రాసులో ఖానుగారు ఇంకో అడుగు ముందుకు వేశారుకూడా. "వ్యతిరేకవర్గంగా సంచరించడమనేది ఏమంత లాభం కలుగచేయలేదు కనుకనూ, పైగా కొందరికి ఇబ్బంది కలిగింది కనుకనూ తాను ముస్లిం లీగునుండి విరమిస్తున్నానని ఇది యెవరూ అపార్థం చేసికోరాదనీ" అన్నారు. అంటే ఈనాడైనా తాము ఏక భారత సిద్ధాంతాన్ని ఆమోదించలేకపోతున్నారు. స్వప్రయోజనాల నిమిత్తం కొత్త

రాజకీయపు ఎత్తు వేశారేగాని వెనుకటి తత్వాన్ని మాత్రం మార్చుకోలేదని తెలియడం లేదా? ఎన్నివిధాల మనం తంటాలుపడినా "తాము ముస్లింవర్గమునకు చెందామనే" ప్రత్యేకభావన విడనాడలేరు.

ఇది మనకు క్షేమకరమా అని ఆలోచించ దగినది కదా?

ఏది ఏమైనా, వీరిని శంకించి తీరవలెనని గాని, కాంగ్రెసులో చేర్చుకొనరాదనిగాని మరి ఇతరముగా గాని అభిప్రాయపడరాదు. కాని కొంత జాగ్రత్త పడవలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

వారి గత చరిత్రను పరిశీలిస్తే—ఆనాడు ఖిలాఫత్ ఉద్యమం విషయం ఏమనుకున్నాం? హిందూ ముస్లిం ఐక్యతకు అంతకు మించిన ఉదాహరణే లేదనుకున్నాం. నిజం కూడా అంతే. కాని పర్యవసానం ఏమైంది? ఖిలాఫత్ దిగడంతోనే ఐక్యత పోయింది. "మళ్ళీ ఎప్పటి కొలు ఇట్టిట్టే."

మనం ఎన్ని ధర్మపన్నాలు చెప్పుకున్నా మనలను మనమే ఎంత కించపరచుకున్నా (హిందూ ధర్మం వట్టి పాతకాలపు డొక్కు అని నెహ్రూ అన్నాడు) వారుమాత్రం ప్రతి దానినీ ఇస్లాం దృక్పథంలో చూస్తున్నారు. వారు కాంగ్రెసును ఉత్తమ విధానాల వలన మెచ్చుకోడంలేదు. ముస్లిములకు మేలు (ప్రత్యేకంగా) చేస్తుందనే విశ్వాసం వారిది. అంతే. ఇది మనకంత క్షేమకరంగాదు. ఇది తుమ్మితే ఊడే ముక్కువంటిదే. అత్యంత తాత్కాలికం. ఇది మాత్రం మనం గుర్తుంచుకొని మసులు కోవాలి.

ఒక నెహ్రూ నాధారం చేసికొని కాంగ్రెసులో చేరడంగాని, ప్రభుత్వాన్ని సమర్థించడం గాని తగనిపని. ఈదేశంలో ఉంటూ ఈ దేశం, ఉప్పూ పులుసూ తింటూ బతుకుతున్నందువలన ఇచటి ప్రజలలో కలిసిపోవడం, ఇచటి జీవన విధానాన్ని సంస్కృతిని) అలవరచుకోవడం, ఇచట సభ్యతను ప్రేమించగల్గడం, వారికి తగిన పని. అంతేగాని ఎప్పటికప్పుడు తాము పైవారి మని చాటుకుంటూ, ప్రత్యేకత చూపుకుంటూ మన దేహములోని రక్తమాంసముల వలెగాక ఏ ఇతర పదార్థము (foreign material) వలెనో ప్రవర్తించుట ఉభయులకూ క్షేమకరము కాదు. ఇది మనం ఈనాడు కాదు ఏనాటినుంచో వాంఛిస్తున్నాము. అయినా నేటి మన ఈ "ముస్లిం నాయకుల" గత చరిత్రను బట్టి చూచినా, వారి క్షణిక ప్రవర్తనల చూచినా మనం నిర్బంధపడడానికి వీల్లేదు. నిన్నటివరకు కత్తులు కోయడానికి ప్రోత్సహించిన వ్యక్తులు ఒక్కరాత్రిలో మారిపోయి మరునాడు జిన్నా టవర్ మీద ధర్మచక్రాంకిత పతాకను ప్రతిష్ఠించిన మాత్రాన తత్వం మారిందని విశ్వసించడం అవివేకం. కనుక నేడు మన నాయకులు చూపిస్తున్న చూపించనుంటున్న "ధగోసా" మాత్రం మళ్ళీ మన ముస్లిములు దారితీయడానికి అవకాశాలు ఉండవచ్చు.

ఇటువంటి ధగోసాలోనే ఆనాడు (దేశ విభజనకు తొమ్మిది నెలల పూర్వం) నెహ్రూ వంటి మేధావి కాన్పూరు మహాసభలో కర తాళధ్వనుల మధ్య "జిన్నా కలలు గంటున్న పాకిస్తాన్ వెయ్యిసంవత్సరాలకైనా రాబోదు" అని తమ భవిష్యత్తును కొనలేక గర్జించాడు. "వర్తమానానికి పునాది గతం". ఇది మనం మరువరాదు. కనుకనే "ధగోసా" అనేది ప్రమాదహేతువు కావచ్చును, అనవలసివచ్చింది. అంతేకాని వీరు ఏ పాకిస్థాన్‌తోనో పొత్తు కలుస్తారని మాత్రం ఇచ్చట అభిప్రాయంకాదు. అలా జరుగక పోవచ్చు. (జరిగినా వచ్చు. దురదృష్ట వశాత్తు (అవాంఛిత "జహాద్" వస్తే వీరు కాఫిర్లను దునుమాడరని నిశ్చయం ఏమిటి? బీజం వేసి, అంకురం మొలిపించి, ముక్కలుగా చేసిన పాకిస్తాన్‌కు వీరు పోరని విశ్వాసం ఏమిటి? క్షమించాలి. ఇంతటి నిర్వాహ ప్రాంగణానికి.) శంకను వీడి మనం భాయీ భాయీగా సంచరించవచ్చు. (సంచరించాలి కూడా) కాని జాగ్రత్తను వీడి మాత్రం సంచరించడం ప్రమాద హేతువు కావచ్చుని సూచన.



# త్రిశంకు నరకం

సత్యమూర్తి

గోపాలం ఆఫీసు పనులు చక్కబెట్టుకొని యింటి మొహం పట్టేడు. బుర్ర దించి ఏదో దీర్ఘంగా ఆలోచించుకొంటూ రోడ్డుకు ఏకైన ప్రక్కనబడి నడుస్తున్నాడు. అంతే పట్న వాసం మూలాన్ని గృహాంగనలు రోడ్డు ప్రక్కనే పోసిన పెంటకుప్పల మీదుగా గోపాలం ప్రయాణం సాగిస్తున్నాడు. నీయమైన ఆలోచనమూలాన్ని కాబోలు పెంటకుప్పలు అతని మార్గ నిరోధకాలం కాలేక పోయినై. మిఠాయి అంగడి సమీపించిన తరువాత ఆ సువాసనలు గోపాలం నిశ్చల తత్వానికి భంగం కలిగించినై. ఒక్కసారి తన దృష్టిని తినుబండారాల వైపు మరలించాడు. వ్యాపారి గల్లాపెట్టెలో డబ్బుల మ్రోత వినిపించిన తరువాత అవి తనకు లభ్యం కాని వస్తువులని గుర్తుకొచ్చింది. మెల్లగా మిఠాయి పొయ్యి ఆర్పిన బొగ్గులమీద గోపాలం కాలు వేశాడు. ఎక్కడ దాగుందో అగ్నినెరుసు, అతని కాలు మర్రుమంది. "అగ్ని ఆర్పకుండానే రోడ్డుమీద పోసుకోవాలా వెధవ పెనుగలు?" అన్నాడు మొహం అసోలాపెట్టి వెనక్కు తిరిగి. గుప్పిట నోరు మూసుకొని ఒకరిద్దరు చిన్నగా నవ్వుతున్నారు గోపాలం చేష్టలు చూచి. ఆ నవ్వులు గోపాలానికి వెగటుగా కనుపించాయి. అంత మాత్రంలో వారిని తర్కం చెయ్యగలుగుతాడు? శారీరక బాధను కలుగచేసిన అగ్నినెరుసు నేమన్నా చేయగల్గాడా- ఇక మానసిక విప్లవకారులను శిక్షించడానికి? మళ్ళీ గోపాలం వెనక్కు చూడకుండా ముందుకు సాగిపోయాడు. నోటికోడలు చెప్పుతూంటే ఆమె నేమీ అనలేక యింట్లో పిల్లలను చావమోదిందిట ఒక గృహిణి! అదిగో అలాంటిస్థితి గోపాలానికి వచ్చింది. గోపాలం గుమాస్తాగిరీ చక్కబెట్టుతున్ననాటి నుంచీ ఒక కాగితాల దొంతర ఎప్పుడూ జేబులో ఉంటూ వచ్చింది. ఆ జేబు యిప్పుడు చిరాకుగా కనుపించింది. విసురుగా కాగితాలకట్ట బైటకు లాగాడు. పట్టుతప్పి ఒక కాగితం చిరిగిపోయింది. "చుః! చుః!" అన్నాడు ఆ కాగితానికి కొంత ముఖ్యత్వాన్ని ఆపాదిస్తూ. ఆ చిరిగిపోయిన కాగితాన్ని మడిచి జాగ్రత్తగా జేబులోనుంచి మిగత కాగితాల ముఖ్యాముఖ్యాలు పరిశీలించాడు. ముఖ్యములు కాని కొన్ని కాగితాలు వరుసగా క్రిందకు జారవిడిచాడు. పని తొందరలో జారిపోయిన కాగితాన్ని మళ్లీ వంగి తీసి జేబులో పెట్టుకొన్నాడు. కార్యక్రమం ముగిసిన తర్వాత జేబులో ఉన్న చిరిగిపోయిన కాగితంమీదకు గోపాలం దృష్టి మరలింది. ఆ కాగితం చాలా ముఖ్యమైనది. దానికి నకలుగా మరోటి వ్రాసుకుందామంటే కలక్టరు దొరవారి సంతకం, ఆఫీసు మొహరు అడ్డువచ్చినై. అందుకని నాలుగు వీధుల మొగలో నిలుచుని నలువైపులకు దృష్టి సారించాడు. కుడిచేతివైపు ప్రక్క సందులో చుట్టల దుకాణం ఒకటి కనుపించింది గోపాలానికి. నేరుగా అక్కడకు నడక సాగించాడు. ఆ దుకాణంమీద ఒక పనివాడు చుట్ట చివళ్ళకు జిగురు రాస్తున్నాడు. "ఒక్క పిసరు జిగురిద్దురూ! కొత్త కాగితం అంటించుకోవాలి" అన్నాడు గోపాలం పనివాడి నుద్దేశించి. ఇంతలో యజమాని ముందుకొచ్చి "ఇది వ్యాపారమా మరోటా? ఇక్కడ మీ కందరకూ జిగురు దాచుకూర్చోలేదయ్యా" అన్నాడు. గోపాలం యీ మర్యాదను ఊహించైనా ఉంటే అసలక్కడకు వచ్చి ఉండేవాడు కాదు. పాపం ఏం చేస్తాడు యీ కార్యక్రమానికే పూర్తిగా స్వస్తిచెప్పి చురుకుగా నడవడం ప్రారంభించాడు.

కాఫీతాగి సింగారించుకున్న ముఖాలు కొన్ని గోపాలానికి ఎదురైనాయి. ఎంత జాగ్రత్తగా నడుస్తున్నా ఉత్సాహం కొద్దీ గెంటుకుపో

తున్నారు. గోపాలం దృష్టి యింటిమీదకు మరలింది. కాస్త కాఫీ పడితేనేగాని చురుకు పుట్టదు. ఏమో యీవాళసలు కాఫీ పెట్టిందో లేదో భార్య? నెలాఖరవుతుందని పాలవాడు బిల్లు జమకట్టమంటున్నాడు. "ఒక్క రెండు రోజు లాగుమా!" అని సర్ది చెప్పాడు గోపాలం ఉదయం ఆఫీసుకు వెళ్ళేముందు. అయినా వాడి దగా. ఏ పెళ్ళివారికో పోదామని చూస్తే ఎన్ని సార్లు హోటలు కాఫీ తెప్పించుకొని తాగలేదు గోపాలం? ఇంతవరకూ పాలవాడి మాట ఎలా వున్నా గోపాలం భార్య స్థితి ఎలా ఉందో? అతను ఆఫీసుకు బయలుదేరే ముందే మనస్పర్థలు ఏర్పడ్డాయి. అమ్మ చెంగుపట్టుకొని విడువని ఎడపిల్లాడుకూడా ఆడుకోడానికి వెళ్ళిపోయాడు. గోపాలం భార్య మంకు పట్టుదలజూచి తుదకు "నా యిష్టం" అని లెక్కచేయకుండా విసుగ్గా మెట్లు దిగాడు ఉదయం. ఇవన్నీ జ్ఞప్తికొచ్చి గోపాలం ముఖం వివర్ణమైంది. ఈలోగా యిల్లు సమీపించింది. గోపాలం గుండెలు కొంచెం వేగంగా కొట్టుకోవడం ప్రారంభించినాయి. నడకలో వేగం తగ్గింది. గుమ్మం ముందున్న నాలుగు మెట్లెక్కడానికే అతని మనస్సు యిచ్ఛగించింది కాదు.

వీథి కిటికీలోంచి లోపలకు తొంగిచూశాడు. కండ్లకు అన్వేషణశక్తి అబ్బింది. చెవులు గ్రహణ శక్తిని అభివృద్ధిపరచుకొన్నాయి. గోపాలం శరీరం ఆ క్షణంలో విషయగ్రహణ,యంత్రంగా మారిపోయింది. లోపల చెంబులు, గ్లాసులు వగైరా పాత్ర సామానులు ఒకదానిమీద ఒకటిపడి మ్రోగిపోతున్నాయి. భార్య కోపం ఉధృతమైనదని గోపాలం తెలుసుకున్నాడు. కురుక్షేత్ర యుద్ధ ప్రారంభం ముందు పాంచజన్యం, దేవదత్తం, పౌండ్రం మొదలుగాగల రణశంఖారవములుగా వినిపించాయి గోపాలానికి లోపల భార్య విసురుగా పడవేస్తున్న పాత్ర సామానుల శబ్దాలు. కిటికీముందు కొంతసేపలా నిశ్చలంగా నిలుచుండి పోయాడు. అసంఖ్యాకంగా ఊహలు అతని మనోవీథిని సంచరించినాయి. ధైర్యం చిక్కబట్టుకొని గట్టిగా పకిలించాడు భార్య జడిసి శాంతిస్తుందని. కాని గోపాలం అనుకున్నట్లు జరుగలేదు. ఇంతవరకూ చేతల్లోనే విసుగు చూపిస్తున్న భార్యకంఠమెత్తి కయ్యానికి కాలు దువ్వింది. తన అసహాయతకు చింతిస్తూ మౌనంగా గుమ్మంముందు నిలుచుండిపోయాడు. నాన్న వచ్చినట్లు గమనించి పాపవచ్చి వీథి తలుపు గడియ తీసింది. గోపాలం దీనంగా అడుగు గడప దాటించాడు. పాప నాన్న దగ్గర నుంచొని పుచ్చుకుంటానని నవ్వుతూ గోపాలంవంక చూసింది. నాన్న "బూచి"లా కనపించాడు. "నాన్న, బూచి"గా ఎలా మారిపోయాడు? అని ఆలోచించుకొంటూ వెర్రిగా గ్రహించిపోయి గోపాలం మొహంలోకి తీక్ష్ణదృష్టితో చూసింది. గోపాలం కూడా చలించకుండా నిలబడి పాపవంక దీనంగా చూశాడు. ఒక్క అక్షరం నవనం నాన్న నోటి నుండి రాకపోవడం చూచి పాప బావురుమంది. గోపాలం చలించిపోయాడు. తన శరీరాన్ని ప్రవర్తనను లోలోన దూషించుకున్నాడు. "ఏం తల్లీ అలా ఏడుస్తావు?" అని ఒక్క పట్టున పాపనెత్తుకొని లోపలికి వెళ్ళిపోయాడు. పాప కన్నీళ్ళు నాన్న భుజానికి తుడుచుకొంది.

గోపాలం మనస్సులో మళ్ళీ కొంత శాంతి యేర్పడింది. పాపను బుజ్జగిస్తూ క్రిందకు దింపి "కాగితం అంటించాక కొంచెం అన్నం తీసుకురా తల్లీ" అని పంపించాడు. పాప వంటింటి గుమ్మంకు వెళ్ళనిక్కే గానీ ఆపసాను చీ జవాబు ఘాటుగా వచ్చింది. "కూర్చున్నా నేమిటి నేను? చచ్చి చెడి చేస్తూనే ఉన్నాను. వెధవ కర్రలు పొయ్యి మండనిది నేనేం చెయ్యను?" అంది భార్య వంటింట్లోంచి. చాల గాయపడి తన నిస్సహాయతను వ్యక్తపరుస్తూ జాలి మొహం పెట్టి చూసింది గోపాలం వంక. గోపాలం దీర్ఘంగా ఒక్క నిట్టూర్పు మాత్రం విడిచి పాపను లోనికి ఆహ్వానించకుండా గదిలో ప్రవేశించాడు. పిలవని పేరంటానికి వెందుకని పాప ఆ గదిలోకి పోలేదు. గదిలో గోపాలం కుర్చీలో కూర్చుని టేబిలు చివరనున్న పుస్తకాన్ని సాగి అందుకొన్నాడు. అలా నిశ్శబ్దంగా కొంతకాలం గడిచింది. కాఫీవేళ దాటిపోతూంది. గోపాలం ఆలస్యాన్ని భరించలేక "ఏం! యింకా కాఫీ కాలేదూ?" అన్నాడు

మాస్టరు ట్రైనింగు చదివి పంతులమ్మగారైంది. పంతులమ్మగారికి గోపాలం ఉంటున్న పట్టణానికి బదిలీ కావడంచేత ఒక ఉత్తరం వ్రాసింది. "కొత్తలో రెండు రోజులపాటు గోపాలం యింట్లో ఉండి తరువాత యిల్లు చూచుకొని వెళ్ళిపోతానని" ఆ లేఖ సారాంశం. ఆ ఉత్తరాన్ని గోపాలం అందుకున్న వెంటనే భార్య ముందు ముచ్చటగా చదివి వినిపించాడు. అక్కడనుండీ గోపాలానికీ భార్యకూ మనస్పర్థలు ఏర్పడినై. "ఒక ఆడది పరాయి మొగాడికి ఉత్తరాలు వ్రాయకూడదు" అంటుంది భార్య. నాగరికతా ప్రపంచ లక్షణాలు వరుసగా వర్ణించాడు గోపాలం-భార్య ముందు. అయినా ఆమె కప్ప విజ్ఞానంతో విశాల అభ్యుదయ ప్రపంచ భావాలను చూడలేకపోయింది. తుదకు ఆమె మంకు పట్టుదల, గోపాలం తిరస్కార భావం, మిగిలిపోయాయి.

గోపాలం పాప చేతిలో వస్తువును "గ్ల[illegible]మని" చెబితే నవ్వింది. చదరంగ బలగంలో వస్తువుల పేర్లు తెలియనివారైనా అదే చేస్తారు. అది పాప తప్పు కాదు. పాప అది గ్ల[illegible]మని తనంతటతాను తెలుసుకోడానికి కొంత కాలం పడుతుంది. అప్పటివరకూ గోపాలం ఎంత ప్రయత్నించినా ప్రయోజనం ఉండదు. గోపాలానికీ యిదే తట్టింది. అయితే అతడు అంతటితో ఆగిపోలేదు. తన భార్య చదువరి కాదు. ఆమె దృష్టిలో వయస్సున్న యిద్దరు స్త్రీ పురుషులు మాట్లాడుకుంటే వారు భార్యాభర్తలు కావాలి. అలా కాని పక్షంలో వారు పవిత్రులుగారు. ఒక స్త్రీ పర పురుషునికి ఉత్తరం వ్రాయడం గోడచాటు గుసగుసలాంటిది. పంతులమ్మ గోపాలానికి ఉత్తరం వ్రాయకూడదు. అది ధర్మవిరుద్ధం. గోపాలం భార్య యిది సహించలేదు. భర్తను పాడు పోకడలకు పోనీకుండా కాపాడుకోవడం గృహిణి ధర్మం. భార్యమాట వినకుండా గోపాలం 'నా యిష్టం' అని సంచరించడం ప్రారంభించాడంటే ఒక పతివ్రతామతల్లి కంట తడి పెడుతుంది. తద్వారా ముక్కోట్ల జాబితాలో ఒక పేరు [illegible]తుంది — గోపాలం పంతులమ్మ ఉత్తరం వ్రాస్తే భార్యపక్క చదివాడు. అతని దృష్టిలో పంతులమ్మ ఒక పవిత్రమైన స్నేహితురాలు. ఆమె తన యింటికి వస్తున్నానని ఉత్తరం వ్రాస్తే ఆహ్వానించడం గృహస్థు విధి. లేకపోతే "అతిథి సత్కారం" అన్న ఒక ముఖ్యమైన ధర్మాన్ని అతడు ఉల్లంఘించినట్లవుతుంది. ఆ నాగరిక ధర్మాన్ని ఆచరింపను పూనుకొన్న గోపాలం చాలా చురుకుగా ఉన్నాడు. అది ధర్మ సమ్మతమని తన భార్యచేత ఒప్పించాలని గోపాలం ప్రయత్నించాడు. అంత సంస్కారం ఆమెలో లేదు. ఒక ఉపన్యాసమిచ్చి ఆమెను ఒప్పించాలని చూస్తే గోపాలం శాంతిని కోల్పోయాడు. అతను ప్రయత్నం విరమించకపోతే "గుసగుసలు" అతన్ని దగ్ధపరుస్తాయి. ఇవన్నీ నిశ్శబ్దంగా ఆలోచించి గాని నిర్ణయించి గది నాలుగింటి వైపు నడిచాడు గోపాలం "పంతులమ్మగారిని మన యింటికి రావద్దని ఉత్తరం వ్రాస్తాను" అన్నాడు భార్యవంక చూస్తూ. భార్య ముఖం విజయగర్వంతో వికసించింది.

———:O:———

జెకోస్లవేకియా దేశానికి చెందిన ఫ్రాజెక్ జార్డా అనే ఒక ఇంజనీరు, తన ఎక్స్‌ప్రెస్ రైలుబండిని అతివేగంగా నడుపుతూ తన దేశపు సరిహద్దు దాటి జర్మనీలోని హాఫ్‌కి వచ్చి చేరాడు. ఆ రైలులో ఆయనతోపాటు మరి నూట పదకొండు మంది యాత్రికులు కూడా ఉన్నారు. వీరిలో ఇంజనీరు, ఆయన భార్య, ఇద్దరు బిడ్డలతో మొత్తం ఇరువదినాలుగు మంది పశ్చిమ జర్మనీలో తమకు ఆశ్రయం కల్పించవలసిందిగా కోరారు. కమ్యూనిస్టుల పరిపాలనలో ఉన్న తమ దేశంనుంచి తప్పించుకొని బయటపడటమే తమ ఆశయమని వారు చెప్పారు. జర్మనీలో అమెరికా ప్రతినిధి కార్యాలయంవారు వీరికి ఆశ్రయం కల్పించి, తక్కిన ప్రయాణీకులు జెకోస్లావేకియాకు తిరిగి వెళ్ళడానికి అనుమతి యిచ్చారు.

# గీతా స్వయంవరం

(కథానిక)

గీత మరొక్కసారి అద్దంలో నీడ చూసుకుంది. ఎంత అందంగా వుంది తను! అజంతా శిల్పంవలె, దేవలోకంలో దేవకన్యవలె! జుట్టు వంకులొంకులు తిరిగి భుజాలమీద పడుతోంది. తనలాగ అలంకరించుకోగలిగే వాళ్లు ఒక్కరయినా వున్నారా? తన చెలి గోరుకు కూడా సరిపోరు. గీత కళ్ళల్లో గర్వం తొణికిసలాడింది.

గర్వంగా తన శరీరాన్నంతా మళ్ళీ చూసుకుంది. పండు వెన్నెలలో, సహస్రదళ పద్మంలో అధివసించిన, ఎంతో పని మెళకువలు తెలిసిన శిల్పి మలచిన శారదాదేవి విగ్రహంలా మెరిసిపోతోంది తను. మళ్ళా అద్దం ముందు నుంచుని పరీక్షగా ముఖానికి పౌడరు అద్దుకుంది. సువాసనతో చేతులు తుడుచుకుంటూ గదంతా ఆమె చూపు కన్నులతో కలయజూసింది. దృష్టి గుమ్మక్కని టేబిల్ మీద వున్న వుత్తరంమీద పడింది. ఎడమచేతి చిటికెన వేళ్ళతో జాగ్రత్తగా పట్టుకొంది ఏమిటి వుత్తరం? అన్నట్లు. శేఖరం రాసిందికమూ! పాపం వెర్రివాడు. ఆ వుత్తరం నాలుగు గంటలకే వచ్చింది. చదవకుండానే పడేసింది. అందులో ఏముంటుందో తనకు ముందే తెలుసును.

"గీతా! నేను నిన్ను ప్రేమిస్తున్నాను" పెద్ద అక్షరాల్లోటి వ్రాశాడు. ఎవరైనా ఇంతే. ఆ వుత్తరాలు చదివిచదివి విసుగెత్తిపోయింది తనకు. ఒక్క చిన్న నవ్వు నవ్వినా, రెండు మాటలు మాట్లాడినా చాలు. ప్రతివాడూ ప్రేమలో పడడమే. ఇంక నోరు కట్టేసుకోవాలంతే. అందరూ అంతేనా?...అబ్బే కాదు కాదు. ముఖ్యంగా రామంమాత్రం అలా కాదు. అబ్బ! రామం ఎంత చక్కగా వుంటాడు! అమాయకంగా వుండే ఆ కళ్లు చిటుక పెట్టినట్లుంటాయి.

తను మొదటిసారిగా అతన్ని మూర్తియింట్లో పుట్టినరోజు పండుగకి వెళ్ళినప్పుడు చూసింది. తను వెళ్ళేసరికి అతను పిల్లనగ్రోవి వాయిస్తున్నాడు. అతన్ని చూడగానే తన గుండె ఒక్కసారిగా ఆగిపోయి నట్లయింది. ఎలాగైనా అతనితో మాట్లాడాలి. స్నేహం చెయ్యాలి అనుకుంది. కాని అదేం తను అనుకున్నంత కష్టం అవలేదు. అతను సుందరికి అన్న వరుస అవుతాడట. ఇంజనీరుకూడాను. సుందరే తనను పిలుచుకెళ్ళి పరిచయం చేసింది.

అతనంత చదువుకున్నాడని తెలిసినా, తొణుకులేకుండా మాట్లాడేసరికి తన కాశ్చర్యం వేసింది. మరొకరైతే ఈపాటికి తిత్తిత్తే, మెమ్మెమ్మే అయ్యేవారే. ఎదురుగుండా టిష్యూ చీర, హ్యాండ్ బ్యాగు చూసేసరికి యెటువంటి వాళ్ళకైనా నత్తొస్తుంది. అతనన్న ప్రతి మాటకీ తను నవ్వింది. అసలతన్ని చూసేసరికే తనకి మతిపోయింది.

తరువాత అతన్ని రోజూ చూస్తూనే వుంది. క్లబ్ లోనో, సినిమా థియేటర్ లోనో, పార్కులోనో. అలా చూసినప్పుడల్లా తన గుండె ఒక క్షణం కొట్టుకోవడం మానేస్తూనే వుంది. ప్రతి రోజూ అతను తనగురించి ఏకొంచెమైనా అంటాడని ఆశిస్తూనే వుంది. కాని... కాని ... ఒక్కసారీ అతనేం అనలేదు.

ఆ విషయం తల్చుకుంటే, అతనిమీద ఎంతో కోపం వస్తుంది. ఎందుకనడు? మిగిలిన అందరూ మర్నాడే వుత్తరాలు రాసేవారే. కాని యీ రామం మాటవరుసకైనా నిన్ను ప్రేమిస్తున్నాను అనడేం? అలా వ్రాసిన వాళ్లందరి వుత్తరాలు చిత్తుబుట్టలో పడి గాలికెగురుతున్నాయి. రామం, వుత్తరం కాదు మాటైనా అంటే, తను కరిగి నీరై అతని పాదాలచుట్టూ నిలచిపోదూ!

అనుకుంటుంటూనే కళ్లుచెమ్మగిల్లాయి. ఎందుకనడు? యిదీ సంగతి, బహుశా అతను భయపడి వుంటాడు. తను అందరినీ త్రోసిపుచ్చిన

సమయమంత్రి వసంతదేవి

సంగతి అతనికి తెలిసే వుంటుంది. తనపనీ అంతే అవుతుందనుకుని వుంటాడు. చిత్రం, తనకంత వరకూ యీ విషయం తట్టనేలేదు. తనతన్ని ప్రేమిస్తున్న సంగతి ఏవిధంగానూ తెలియపరచలేదు. తెలివితేటలు!

నవ్వుకుంటూ మరోసారి అద్దంలో చూసుకుని, జార్జెట్ చీర కుచ్చిళ్ళు సరిగ్గా సర్దుకుని కారు ఎక్కింది.

తలుపు తట్టేసరికి రామం తల్లి వచ్చి తలుపు తీసింది. 'రామం ఇంట్లో వున్నాడా' అంటూనే లోపలికి అడుగు పెట్టింది.

"రా అమ్మా గీతా! యిప్పుడే నీమాట అనుకుంటున్నాను" అంది ఆవిడ. ఆవిడకి తనంటే ఎంతో ప్రేమ. చాలా ఆప్యాయంగా మాట్లాడుతుంది.

"ఏం! రామం యింట్లో లేడా!"

"అబ్బే! లేడు! అవునుగాని రామానికి తాంబూలాలు పుచ్చుకుంటున్నాం. పెళ్ళికూతురికి యెటువంటి చీర బాగుంటుందో ఏమో! వాడికి ఫేషన్లు తెలీవు. చూడమ్మా గీతా! నీకు బాగా తెలుస్తుంది. వుండు చీర తెస్తాను." అంటూ జవాబు నిరీక్షించకుండానే లోపలికి వెళ్ళింది.

ఝళిపి కొరడాతో కొట్టినట్లయింది, గీతకు. ఏమిటీ, రామానికి పెళ్ళా? తను కడుతున్న సౌధాలన్నీ నేలకూలవలసిందేనా! తనెంతెంతో ఆశలతోటి వచ్చింది. ఏమిటిల్లాగ!

"చూశావా! ఎర్రరంగిప్పుడు ఫేషనేనా! ఎర్రపట్టుచీరమీద జరీపువ్వులు బాగుంటాయా! నీకు నచ్చితే చాలు. ఫర్వాలేదు. నీకంటే తెలుసున్న వారెవరు?" అంటూ ఆవిడ గీత ముఖం చూడకుండానే చదివేస్తోంది.

గీతకివేం వినిపించే స్థితిలో లేదు. అంతా అయోమయంగా వుంది.

"అవునుగానీ! యింతకీ ఆ అమ్మాయి ఎల్లా వుంటుంది" ఆఖరికి కూడబలుక్కుంటూ అంది.

"అబ్బే! నేమాశానా ఏమిటి? వాడే చూసుకొచ్చాడు. ఏదోనమ్మా, మూడు ముళ్లూ పడితేచాలు. నాకీ లోకంలో యింకేంకావాలి చెప్పు."

"మొదలెట్టావూ! అనుకుంటూనే వున్నాను ఈ కబురు విన్నదగ్గర్నుంచీ అమ్మ కిదేపనుకో. విసుగూ విరామం లేదు. ఎవరైనా కనిపిస్తే చాలు. ఇంతకంటే ఒక్కసారి రేడియోలో ప్రసారం చేస్తే బాగుంటుందని చెప్తున్నాను" అంటూ నవ్వుతూ లోపలికి వచ్చాడు రామం.

గీత మెదడు వుడికి పోతోంది. ఏదో ఒకటి తేల్చేసుకోవాలివ్వాళ. తను రావటం మంచిదే అయింది.

"అమ్మా! నీ గొడవే గాని యింకెవరిదీ పట్టించుకోవు. గీతకి కాస్త కాఫీ యేనా యిచ్చావా?"

"అయ్యో నా మతి మండిపోనూ! కూర్చో అమ్మా గీతా. యిప్పుడే తెస్తాను" అంటూ ఆవిడ గబగబా లోపలికి వెళ్ళింది.

గీత వాంఛిస్తున్న సమయం యిప్పటికి దొరికింది. అడిగెయ్యాలి. ఇంక ఆలస్యం ఎందుకు?

"రామం నీకు పెళ్ళటగా!"

"అమ్మేనా చెప్తా? ఆవిడకిదేపని, ఎవరైనా కనపడ్డం భయం. మొన్న నెప్పుడో చెప్పాను. అమ్మాయిని చూసేనని. అంతే పట్టుకుంది..."

"అయితే, నేనంత వినకూడని దాన్నా" స్వరంలో కోపం బాగా తొంగిచూస్తోంది.

"నేను అల్లాగని అన్నానా!"

గీత కింకేం మాట్లాడటానికి తోచలేదు. కాలం నిశ్శబ్దంగా గడిచిపోతోంది. దుఃఖం వెళ్ళుక్కు వచ్చేస్తుంది. చెప్పేదెలాగా!

"రామం!"

"ఏం గీతా!"

"నీకు తెలీదా!" స్వరంలో గొంతు పూడిపోయినట్లయింది. మిగిలిన వాక్యం గొంతుకలోనే వుండిపోయింది.

"ఏమిటీ తెలియడం" ఆశ్చర్యంగానే అడిగాడు.

"మరి...మరి ... నేను నిన్ను ప్రేమిస్తున్నా" అని అతికష్టం మీద అనగల్గింది. తన జీవితమంతా అతను చెప్పబోయే మాటమీద ఆధారపడి వుంది.

"అహా! అలాగా."

"నువ్వు నన్ను ప్రేమించటం లేదా!" యింత యిలాగ తన జీవితంలో ఎవరి దగ్గిరా లొంగి

పోలేదు. కాని అతను ఊ అంటేచాలు! తను అతని కాళ్ళకింద చీమలా నలిగి పొమ్మన్నా నలిగి పోగలదు.

“నేను మాత్రం కాదన్నానా. కాని యీ సంభాషణ కోసం ఎంతమంది ఎదురు చూస్తున్నారో అని!” అతని స్వరంలో నవ్వు దాచుకుందామన్నా దాగటంలేదు. గీతకా నవ్వు ముళ్ళ తిమ్మిరిలా బాధించింది. ఎంత హేళనగా అన్నాడూ! అయినా దీంతోటి తేలిపోతుంది.

“అయితే! ఆ అమ్మాయి నాకంటే అందంగా వుంటుందా?” వ్యంగ్యంగానే అంది. ఆ అనడంలోనూ ఛాలెంజ్ చేస్తున్నట్టే వుంది.

“నీకంటే యీ ప్రపంచంలో అందంగా వుండే వాళ్ళెవ్వళ్ళూ లేరు. నువ్వు నిజంగా అప్సరసవే. కాని ఆమె మానవస్త్రీ... మంచి మర్యాదా, ప్రేమా, స్నేహం, అవసరం తెలిసున్న సామాన్యగృహిణి. అదే ఆమెకుండే సహజ సౌందర్యం. ప్రతీ మానవుడూ వాంఛించేదికూడా అదే.” ఏదో ఆలోచిస్తున్న వాడిలా నెమ్మదిగా అన్నాడు రామం. ఈ మాటలంటుంటే అతని ముఖంలో ఏదో వింత వెలుగు కనిపించింది.

గీత మొదటిసారిగా ఓటమినంగీకరించవలసి వచ్చింది. తన అందం, తన డబ్బూ, తన హోదా, తను - ఎంతమందిచేతో పొగడబడిన తను - తృణీకరించబడింది. తన అందం అసలు అందమే కాదట. గీతకి తనచుట్టూ వెయ్యి కంకాళాలు వికటాట్టహాసం చేస్తున్నట్లయింది. ఆమెకింక అక్కడ ఒక్కక్షణమైనా ఆగ నవసరం లేదు. చెవులు హోరెత్తిపోతున్నాయి.

వెళ్ళి కారులో పడేవరకూ, తను యీ లోకంలో వున్నట్లుగానే తోచలేదు. అత నేదో అంటున్నా వినిపించుకోకుండా యింటికి వెళ్ళిపోయింది.

వెళుతూనే మంచంమీద పడిపోయింది. కోపం, కోపం వెనుక వుక్రోషం, ఆ వెనుక దుఃఖం ఒక్కసారిగా ముంచివేశాయి. ఎంత మాట అన్నాడు రామం! తను పుట్టిన దగ్గర్నుంచీ ఎవరిచేతా పల్లెత్తు మాట పడలేదే. తన యిరవైఏళ్ళ జీవితంలోనూ కూడా యిటువంటిదేమీ సంభవించలేదు. తన తండ్రి ఎంత గారంగా పెంచాడు. తనకేం లోటని అలా అన్నాడు రామం. మొదటే తెలిస్తే అసలు రామం మొఖం చూసేదా తను?

ఎంతాపుకున్నా దుఃఖం ఆగలేదు గీతకి. వెక్కి వెక్కి ఎంతోసేపు ఏడ్చింది.

ఇలా వూరుకోవడమేనా? తనేకదా పెండ్లి చేసుకోబోతున్నానని ఎంత గర్వంగా వుంది రామానికి! ఆ గర్వం ఎల్లాగయినా అణచాలి. ఏమిటుపాయం, పోని ఆ పెండ్లికూతురికోటి రామం చాలా చెడ్డవాడని చెప్పితే—పెండ్లి చెడిపోతుంది. బాగానేవుంది. కాని అసలా పెళ్ళికూతురెవరో తెలియదు. అయినా కాకపోయినా అది ముఖ్యంగా తన హోదాకే భంగం.

మరెల్లాగ. ఏమైనా సరే ప్రతీకారం చెయ్యాలి... తనేనా అంత తక్కువ? ఎలాగా, ఏమి టుపాయం. అబ్బ! మెదడు వేడెక్కిపోతోంది .. ఆ! అవును. అతనికంటే తనే ముందు పెండ్లి చేసుకుంటే చాలా బాగుంటుంది. ఎంత తెలివైన బుద్ధి తనది. చెప్పుతీసుకు కొట్టినట్లుంటుంది. తను ముందు పెండ్లి చేసుకోవాలి. అతనికి ఆ పెండ్లి అవాలి. ఐన తర్వాత బాగా పశ్చాత్తాప పడాలి. అప్పుడూ తన కానందం. లేకపోతే తనంతటి దాన్ని, స్వయంగా తను, నోరు విప్పి పెండ్లి చేసుకోమని అడిగితే వద్దంటాడా?

ఇంతవరకూ బాగానే వుంది. కాని ఎవర్ని పెండ్లిచేసుకోవటం. అబ్బబ్బా! అడుగడుక్కీ సమస్యలే. ఎవరైతేనేమిటి? రామం కాక పోయిన తర్వాత. ఎవరైనా ఒకటే. కాని, నిజంగా తను పెండ్లి చేసుకుంటానంటే, ఒక్కరూ నమ్మరు ..సరికదా! నవ్వి ఆగి వచ్చిపోతారేమోనని భయంకూడాను! సుందరం సుబ్రహ్మణ్యం, గోపి, రాజు .. అబ్బే వీళ్ళందరిదీ ఒకళ్ళకంటే ఒకళ్ళవి పాత చింతకాయ పచ్చడి వ్యూహాలు.

తీరా పెండ్లి చేసుకుందామనుకుంటే ఒక్కళ్ళూ తగినవాళ్ళు లేరే! గీత దృష్టి గబుక్కుని టేబిలుమీదున్న ఉత్తరంమీద పడింది. గీతకి మెరపులా ఒకఆలోచన తట్టింది. శేఖర్ ని

పెండ్లి చేసుకుంటే? అవును. చాలా బాగుంటుంది. పాపం యిందాకటినుంచీ అతని సంగతి జ్ఞాపకం రానేలేదు. ఏదో సామెతలాఅయింది. శేఖర్ కేదో మేడా, కారూ వున్నాయి. బాగానే వుంటాడు. ఇప్పుడే వెళ్ళి చెప్పాలి. చెప్తే అసలు నమ్మడేమో—

ఓసారి అద్దంలో చూసుకుని "లలలా" అని పాడుతూ హుషారుగానే మేడ దిగింది. కారెక్కి శేఖర్ యింటికి వెళ్ళింది.

ఇంకా అట్టే ఎక్కువగా రాత్రి అవలేదు పౌర్ణమి ముందు రోజులేమో, చంద్రుడు తొందరగా వచ్చేశాడు. ప్రకృతంతా వెండిమలామా చేసినట్లుంది. వెన్నెల రోడ్డుమీదపడి ఏదో వెండినది ప్రవహిస్తున్నట్లుంది.

కారు ఒక్క కుదుపు కుదుపి ఆగేవరకూ గీతకి స్మృతిరాలేదు. తన ఆలోచనలోంచి యివతల పడేసరికి డ్రైవర్ అక్కడ నౌకర్ని శేఖరున్నాడా అని అడుగుతున్నాడు.

"శేఖరుబాబుకి వెళ్ళారండి. వూరెళ్ళారు. నెలదాకా రారు" అని చెప్పాడు నౌఖరు.

గీతకి గుండె ఆగినంత పనయింది. ఎలావచ్చి తన గదిలో పడిందో తనకే తెలీదు.

ఏమిటి తననుకునే ప్రతి పనికి ఇలావిఘ్నం వస్తోందేమిటి? గీతకి బుర్ర బద్దలు కొట్టేసుకోవాలన్నంత బాధకలిగింది. ఎలాగ? తను ఇతరుల మొఖం యెలా చూడగలదు? యింత పరాభవం జరిగాక తను భరించి వూరుకోవలసిందేనా! ఎంత ఖర్మొచ్చింది ఇంక... ఇంక తను బ్రతికి లాభం ఏమిటి?

వెక్కి వెక్కి గంటలకొద్దీ యేడ్చింది. ఈ ప్రపంచంలో అభాగ్యులకూ, నిస్సహాయులకూ సమయానికి కనిపించేదీ, ఓదార్చేదీ యేడుపు ఒక్కటే.

అలా చాలాసేపు ఏడ్చినమీదట గీతకు కొంత మనస్సు స్థిమితపడినట్లనిపించింది. నెమ్మదిగా జరిగిన సంగతులన్నీ నెమరుకు తెచ్చుకో సాగింది.

రామం ఎందువల్ల అలా అన్నాడు? ఇంత మందీ తన్ను పొగిడేవాళ్ళేకాని, నిజంగా తనెవరికీ అవసరంలేదు. తనుఅడిగినా అక్కరలేదంటారు. ఛీ. ఒక్కళ్ళకి వ్యక్తిత్వం లేదు. దీపం చుట్టూ తిరిగే పురుగుల్లాగు! భగవంతుడు తననెందుకిలా పుట్టించాడు? అందరిలాగ పుట్టిస్తే, హాయిగా అందరిలాగా సుఖంగా వుండొచ్చు.

అద్దం ముందు కూర్చుంది. ఏదో విరక్తి పొగమంచులా గీతని ఆవరించుకుంది. నిజమే. రామం అన్నట్లు తనలో ఏదో కలితివుంది. నిండుతనం రాలేదు. తనెంత ఫేషన్‌గా వుంటేనేం. ఎంత బాగా అలంకరణ అయితేనేం, తనెవరికీ అక్కరలేదు. ఎంత అప్సరసలా తయారయితేనేం. ఎవరికీ అక్కరలేని అందం తనకేమాత్రం ఎందుకు?

నెమ్మదిగా ఒక్కొక్క అలంకరణ సాధనాన్నీ మేడమీదనుంచి క్రిందికి విసిరెయ్యటం మొదలుపెట్టింది. అబ్బా! ఎన్నెన్ని రకాల స్నోలు. ఎన్నెన్ని రకాల క్రీములు, పౌడరు టిన్నులు, హెయిర్ రింగులు, పాలిష్— ఒక్కటికూడా వుంచదలుచుకోలేదు తను. ఒక్కొక్కటీ పడేస్తుంటే తనమీదనుంచి ఒక్కొక్క బరువు తీసేస్తున్నట్లనిపించింది.

అన్నీ పారేసి వచ్చి కూర్చుంది. అబ్బా! నిజంగా మనస్సిప్పుడెంత బాగుంది! జుట్టు మామూలుగా దువ్వేసుకుని ముడివేసుకుంది. సిల్కుచీర మార్చి, సాదాచీర కట్టుకుంది. అనవసరమైన వస్తువులు తీసేసింది.

అద్దంలో చూసుకుంది గీత. తను మునపటి గీతేనా—కాదు. నిజమే మునపటికంటే తను ఎన్నోరెట్లు బాగుంది యిప్పుడు. రామం చెప్పిన మాటల కర్థం యిదేనా? తనిప్పుడు సామాన్య స్త్రీయేనా! ఏమో రామాన్నే అడుగుతే సరి.

అవును. ఇప్పుడే అడిగెయ్యాలిఏమైనాసరే.

గబగబా కారు తనే నడుపుకుంటూ, రామం యింటికొచ్చి తలుపు తట్టింది గీత.

తలుపు తీసి గీత వేషం చూసి ఆశ్చర్య పోయాడు రామం.

"రామం నన్ను క్షమించవూ!" ఇంక నిలువలేకపోయింది. ఉద్వేగంతో వళ్ళువణికిపోయింది.

"ఏమిటి గీతా" అంటూ అక్కడ కుర్చీలో కూర్చోపెట్టాడు రామం.

"కాదు రామం, నువ్వన్న మాటలకు అర్థం తెలుసుకోలేక, నిన్నెన్నో అన్నాను. క్షమించవూ!"

"నీలో యీ పరివర్తన కలుగుతుందని తెలి

నుంచే చేసుకుంటున్నాను. కాని, యింత తొందరగా నీలో మార్పు వస్తుందని నేననుకోలేదు" అన్నాడు రామం చిరునవ్వుతో.

"కాదు రామం! నన్ను క్షమించవూ! లేకపోతే నేనూ—" అంటూ లేవబోయింది.

"అబ్బే! యింత రాద్ధాంతం చేస్తావనుకోలేదు సుమా" నామాటకి యింక నవ్వాగలేదు.

ఏమిటి పంతా తమాషా! తన గర్వం తనకి తెలియ చేయడానికి చేసిందా! తను గ్రహించ లేకపోయింది. ఎంత సిగ్గు. తననిడ చూసి తనే భయపడింది. పోనీ యిప్పటికైనా తెలుసుకుంది. లేకపోతే యింకా ఎంత బాధ పడేదో. మబ్బులా వచ్చి మంచులా పోయింది.

"ఏమిట్రా, ఎవరూ వస్తా" అంటూ కళ్ళు నులుముకుంటూ వచ్చింది రామం తల్లి.

"ఇలారా, గీతా! అమ్మకి నమస్కారం పెడదాం" చెయ్యి పట్టుకుని తీసుకెళ్ళాడు రామం. ఇద్దరూ ఒకేసారి ఆవిడ కాళ్ళకి నమస్కారం పెట్టారు.

"ఏమిటిరా నాయనా" అంటూ తెల్లబోయిందావిడ.

"కాదమ్మా, ఈవిడే నీ కాబోయే కోడలు" అన్నాడు రామం.

"అది నీయిల్లు బంగారం కానూ! ముందే చెప్పకూడదురా నాయనా. ఏమని దీవించను. ధన ధాన్యాలతో, కొడుకూ కోడళ్ళతో వెయ్యేళ్ళు బ్రతకండి ఇద్దరూ." అంది రామం తల్లి వాత్సల్యంతో.

---

స్కెచ్

# సుందరం ఉద్యోగం

ఆర్. యం. చిదంబరం

సుందరం యోచించాడు. దేశంలో ఏ మూల చూచినా ఆకలి మంటలు. ఎక్కడ చూచినా నిరాశతో కూడిన నిట్టూర్పులు. అంతా అంధకారమయం. నేటి ప్రజలకు మార్గం చూపే వెలుతురు శూన్యం. దీనికంతా కారణం? "ప్రభుత్వం" అనుకున్నాడు సుందరం. ప్రభుత్వమంటే ఎవరు? ప్రజలేగా. సుందరం అప్రయత్నంగా వార్తాపత్రికలో ఒక ప్రకటన చదివాడు.

"ఇక్కడకు ఎనిమిది మైళ్ళ దూరంలో ఉన్న ఒక గ్రామానికి ఒక వర్తకుడు తీసుకుపోతున్న వంద బస్తాల బియ్యాన్ని ప్రభుత్వపు ఉద్యోగులు పట్టుకున్నారు. దీనినంతా ప్రజలకిచ్చే నిమిత్తం రేషన్ డిపోలకు చేర్చబడింది. సుందరం మళ్ళా తన ఆలోచన ప్రారంభించాడు. అయితే వర్తకుడెంత వెర్రివాడా! వంద బస్తాల బియ్యాన్ని వదిలేసుకున్నాడా? పాపం! ఆ బియ్యాన్నమ్ముకుంటే అతనికెంత లాభం వచ్చేది! అదంతా పోగొట్టుకున్నాడు ...అబ్బే! అన్నికోర్కెలను తీర్చే ఔషధముండగా నష్టపడటమెందుకు? వర్తకుడికి లంచాలతో సర్వము సాధింపవచ్చునని తెలియదా? ఏమో!"

మరునాడు వార్తాపత్రికలో చదివాడు సుందరం:

"ఈ గ్రామంలో నేటినుండి బియ్యం రేషను రెండౌన్సులు తగ్గింపబడింది. బియ్యం నిలవ లేకపోవటంవల్ల ఈ మార్పు చేయవలసి వచ్చిందని తెలుస్తూంది."

సుందరం తెల్లబోయాడు. ఏ గ్రామంలోని రేషను డిపోకయితే వర్తకుని వద్దనుండి తీసి కొన్న వందబస్తాల బియ్యం ప్రజోపయోగ నిమిత్తం మాయబడిందో ఆ గ్రామంలోనే బియ్యం రేషను రెండౌన్సులు తగ్గింపు! బియ్యం నిలవ లేకపోయిందట. చాలా వింతగా ఉందే! అయితే కంచే చేనుమేస్తోందన్నమాటే. వీధిలో నుండి అరుపు:

"బాబూ! మూడు రోజులనుండి తిండిలేదు. పట్టెడన్నముంటే పెట్టు బాబూ."

సుందరం వెంటనే ఇల్లంతా బియ్యంకోసం వెదకాడు. కాని ఫలితం శూన్యం.

"అటు వెళ్ళు బాబూ, ఇక్కడ నాకే తిండికి లేదు."

"పోలీసు ఉద్యోగంలో చేరే వాళ్ళందర్నీ చేర్చుకుంటున్నారు. వెళ్ళాలనిన వాళ్ళంతా పోలీసు స్టేషనుకు వెళ్ళండహో..."

సుందరం చాటింపు విన్నాడు. "అప్పుడు పోలీసు ఉద్యోగంలో చేరితే ప్రభుత్వ శాసనాలు అన్నీ సరిగా జరిగేటట్లు చూడవచ్చు. ముఖ్యంగా దొంగతనంగా బియ్యం పట్టుకు పోయేవారిని పట్టొచ్చు. బాగుంది. ఇంతకంటే తనేం చెయ్యలేడు." సుందరం పోలీసు స్టేషనుకు పరుగెత్తాడు.



సుందరం ఇప్పుడు పోలీసు. సైకిలుకు లైట్లు లేకుండా పోయేవారిని పట్టుకోవటం లేదు. తిండికి మొహంవాచి, మైళ్ళకొలదీ బండి లాగి సగం కడుపుకూడా నింపుకోలేని రిక్షావాడిని నిర్బంధించి వాడి బండికి దీపంలేదని పావలా, అర్ధా గుంజటం లేదు. ధనమదంతో కన్నూ మిన్నూ తెలియకుండా దేశ ప్రజానీకాన్ని పీడించే ధనవంతుల నేరాలకోసం వెయ్యి కళ్ళతో కాపుకు కూర్చున్నాడు. రోజుకు కనీసం ఒక్క కేసైనా తీసుకురావటం లేదని సుందరాన్ని పై అధికారి చీవాట్లు పెడుతున్నాడు. కాని సుందరం ఆమాటలను పట్టించుకోవటం లేదు. బియ్యం దొరక్క నల్లబజారులో రెండుసేర్లు బియ్యం కొనుక్కుపోయే రిక్షావాడినా పట్టుకోవటం?

సుందరాని కొన్నాడు రాత్రిపని పడింది. సంత చెరువుదగ్గర నిలబడున్నాడు. బరువును మోయలేక మోయలేక బక్కచిక్కిన ఎద్లు బండిని లాక్కుపోతున్నాయి. సుందరం గమనించాడు. "ఏయ్! బండి ఆపు" అన్నాడు. బండి దాని త్రోవ నది పోతోంది.

"బండాపు" గట్టిగా అరిచి విజిల్ కొట్టాడు సుందరం. బండి ఆగింది.

"బండిలో ఏమిటి తీసుకుపోతున్నావు? బియ్యం బస్తాలేనా?" గద్దించాడు సుందరం.

"అవునండి" నిర్లక్ష్యంగా జవాబిచ్చాడు బండివాడు.

"ఎవరికి?"

"వెంకటరత్నంగారికి"

వెంకటరత్నమనేసరికి సుందరం తగ్గాడు. వెంకటరత్నమంటే ఆ ఊరికేగాక చుట్టుప్రక్కలున్న గ్రామాలన్నిటికీ లక్షాధికారి. ఆయనకున్న పలుకుబడి ఇంతాఅంతా కాదు ఆయన చేతిలోనే అధికారులంతా ఉంటారు

"పెర్మిట్టేదీ?" సుందరం ప్రశ్నించాడు.

"ఆయనదగ్గరే ఉన్నాయి బాబూ! మీరు వెంకటరత్నంగారి నెరగరండీ?"

"అయితే నీ కెందుకు? ముందు బండిని స్టేషనుకు తిప్పు. పెర్మిట్టులేకుండా బియ్యం తీసుకుపోకూడదని తెలియదూ?"

బండివాడాశ్చర్యపోయాడు. వెంకటరత్నంగారికి బియ్యం తీసుకుపోతుంటే వీడెవడు? మొనగాడేమి? ఇంతకీ వీడు పోలీసు. పై అధికారులే ఆయన చేతిలో కీలుబొమ్మలు.

"అలాగే బాబు. కాని అనక కష్టపడతారు. పెర్మిట్టు ఆయనదగ్గరుంటుంది. ఇది మామూలేనండి. తమరు కొత్తగా వచ్చినట్టున్నారు" అన్నాడు బండివాడు.

ఇంతలో పై అధికారి ఆత్రోవనపోతూ ఆగాడు. "ఏమిటది?" అన్నాడు.

"వెంకటరత్నానికి పెర్మిట్టులేకుండా బియ్యం తీసుకుపోతున్నాడు" అన్నాడు సుందరం.

"ఎవరికి? వెంకటరత్నంగారికా? అయ్యో పాపం! ఆయన బియ్యంలేక చాలా అవస్థపడుతున్నారట. మొన్ననే నాతో చెప్పారు. పర్మిట్టు ఆయనదగ్గరుంటుందిలే. పోనీలేవోయ్' అన్నా డధికారి.

"అదికాదండి. అసలు చట్టప్రకారం పెర్మిట్టులేకుండా బియ్యం తీసుకుపోకూడదు. కనుక ఇప్పుడు బండిని పోనివ్వకూడదు. పెర్మిట్టు ఉంటే ఆయన స్టేషనుకువచ్చి బియ్యం తీసుకు పోనీయండి" అన్నాడు సుందరం.

"ఆయనలాగ చట్టానికి వ్యతిరేకంగా నడవడయ్యా. నీకు మహా తెలుసునులే. ఏయ్ బండి పోనివ్వరయ్యా" అని అధికారి సైకిలెక్కిపోయాడు. క్షణంలో అరాచక మంచుకు ప్రహాసం పల్పులోంకో సుందరానికర్థమయింది.

మరునాడు సుందరంచేతికి తన ఉద్యోగం ఊడిపోయినట్లుగా కాగితం వచ్చింది. అతను తన బాధ్యతను సవ్యంగా నిర్వర్తించకపోవటమే దానికి కారణమని ఆ పత్రంలో తెలుపబడింది.

# ప్రపంచ శాంతి—రష్యా అమెరికాలు

"అశ్వని"

ప్రపంచ యుద్ధం తీసుకురావటానికి అమెరికా బ్రిటనులు బ్రహ్మాండమైన యత్నాలు తలపెట్టాయి. ఏ సిద్ధాంతాలమీదనైతే బ్రిటిషు లేబరు ప్రభుత్వం పదవిలోకి వచ్చిందో ఆ సిద్ధాంతాలను కూడా గాలికి వదిలేసి అట్లీ ప్రభృతులు యుద్ధ ఖర్చు ప్రజలకు అంటగట్టుతున్నారు. బ్రిటనులో దాదాపు కమ్యూనిస్టు ఉద్యమం లేకపోయినప్పటికీ కార్మికులు తమ ప్రభుత్వంపై తీవ్రమైన అసంతృప్తి కనబరుస్తున్నారు కమ్యూనిస్టు ఉద్యమం బొత్తిగా లేకపోయినా అమెరికాలో కూడా కార్మిక అశాంతి కనబడుతోంది.

బ్రిటన్ అమెరికాల వెంట ఉండటానికి ఫ్రాన్సు ఘోరమైన కష్టాల నెదుర్కొంటున్నది. అమెరికా, బ్రిటను ఫ్రాన్సులు ప్రపంచ అగ్రరాజ్యాలు అయిదింటిలో మూడు అవుతాయి. (ఏ ఒక్క అగ్రరాజ్యం యుద్ధం తలపెట్టినా ప్రపంచ శాంతికి భంగం కలుగుతుందన్న విశ్వాసం ఆధారంతో ఐక్యరాజ్యసమితి ఏర్పడింది.) ఈ మూడు అగ్రరాజ్యాలకూ ముఖ్య అభిప్రాయ భేదా లున్నాయి. కాని కేవలం యుద్ధయత్నాలు జయప్రదంగా సాగటంకు లకై ఈ మూడు అగ్రరాజ్యాలూ ఒకదానితో ఒకటి ఏదో విధంగా రాజీపడుతూ రావటం కూడా కనిపిస్తున్నది. ఉదాహరణకు, అమెరికా మాజీ ఫాసిస్టులను తిరిగి పక్షంచేయ నిర్ణయించింది. పశ్చిమ జర్మను సైనికబలాల పునర్నిర్మాణానికీ, జపాను సైనికబల పునర్నిర్మాణానికీ, ఫ్రాంకోతో పొత్తుకూ కూడా మొదట ప్రయత్నాలు చేసినప్పుడు బ్రిటను ఫ్రాన్సులు ఆమోదించలేదు. కనీసం ఆమోదించనట్టు నటించాయి. కాని కాలక్రమాన అమెరికా పథకం నెగ్గటమేగాక ఈ పథకం అమెరికా బ్రిటనుల యుద్ధ యత్నాలతో బహిరంగంగా ముడిపెట్టబడుతున్నది.

ప్రత్యక్షంగా అట్లాంటిక్ ఒడంబడికపై సంతకాలుచేసిన దేశాలు కాక, కిందటి యుద్ధం తెచ్చిపెట్టిన దేశాలలో పశ్చిమ జర్మనీ, జపాను, స్పెయినులు కాక, ఇటలీ, గ్రీస్, ఆస్ట్రేలియా, న్యూజీలాండు, పాకిస్తాను మొదలైనదేశాలనుకూడ అమెరికా నాయకత్వంగల కూటంలోకి చేరదీశారు. ఈకూటంపక్షానే ఉండటానికి నెహ్రూ ప్రభుత్వం ఉవ్విళ్ళూరుతున్నదన్న శుభవార్త విజయలక్ష్మీ పండిట్ ఇటీవల అమెరికావారి చెవిని వేసింది. ఇండోచైనాలాగే ఇండోనీషియా, ఫిలిప్పైన్సు మొదలైనవి ఒడంబడిక కాగితాల దండుగా, సంతకాల సిరా దండుగా లేకుండా అమెరికా పక్షాన ఉండగలవు.

భయంలేదు. దేశాల జాబితా ఐతే చాలా పెద్దదేగాని అమెరికా యుద్ధపక్షాన ఉన్నవి ఈ దేశాల ప్రభుత్వాలేగాని, ప్రజలు కారు. అమెరికా యుద్ధ ఖర్చు నెలకు మూడువేల కోట్ల డాలర్లు పెరిగితే ప్రపంచమంతటా యుద్ధ స్థావరాలు సంపాదిస్తే ప్రపంచ ప్రజలు ఉబ్బి తబ్బిబ్బయిపోరు. అమెరికా యుద్ధ ఖర్చులో భాగం అంతర్జాతీయ రాజకీయాలలో నీతి అన్నదీ, సబబు అన్నదీ, మానవత్వమన్నదీ పూర్తిగా మృగ్యమైపోతూండటం ప్రపంచ ప్రజలు చూస్తూనే ఉన్నారు. ఈ విషయమై ప్రతి దేశంలోనూ కొన్ని పత్రికలైనా నెత్తీ నోరూ బాదుకుని ఘోషిస్తూనే ఉన్నాయి. ఈవిధంగా ఘోషించే పత్రికలలో కమ్యూనిజమంటే, కమ్యూనిస్టులంటే సహించలేనివి చాలా ఉన్నాయి. ఉదాహరణకు "న్యూ స్టేట్స్‌మన్ అండ్ నేషన్" అనే బ్రిటిషు వారపత్రిక.

ఈ పత్రిక అమెరికా పాలకుల విదేశాంగ నీతిని, యుద్ధయత్నాలనూ ఖండిస్తోంది. బ్రిటను అమెరికా అడుగుజాడల్లో నడవకుండా స్వతంత్రంగా తన వ్యవహారాలు నెరపాలంటోంది. బ్రిటను తన సైనిక బలాన్ని పెంచుకున్నా యుద్ధం చేసేటందుకై పెంచుకోరాదంటోంది. చైనాకు ఐక్యరాజ్యసమితిలో స్థానమిచ్చి

ఫార్మోజాను చైనాకు ఇచ్చెయ్యాలంటోంది. అమెరికాలో మెకార్థిజమునూ, ఫ్రాంకోతో అమెరికా చేతులు కలపటాన్నీ, జపానుతో సంధినీ, జర్మన్ నాజీల పునరుద్ధరణనూ నిరసిస్తోంది. రష్యాకూ, పశ్చిమ రాజ్యాలకూ గల విభేదాలు సౌమ్యంగా పరిష్కరించటం సాధ్యమనీ, ఉభయ పక్షాలూ దానికిగాను కృషి జరపాలనీ ఈ పత్రిక తన వాంఛ బయటపెట్టింది. అయితే ఈ పత్రికకు రష్యా మైత్రి వాంఛ ఎంతవున్నదో, రష్యాపట్ల అనుమాన పిశాచంకూడా అంత ఉన్నది. స్కూలులో ఇద్దరు పిల్లకాయలు కొట్లాడుకుంటే ఇద్దర్నీ దండించాలనే పిచ్చిపంతులు మనస్తత్వంతో ఈ పత్రిక బాధపడుతున్నది.

ఈ ఉభయపక్షి మనస్తత్వం మన దేశంలో కూడా ఉన్నది గనక దాన్ని గురించి తెలుసుకోవటం అవసరం. రష్యాపై ప్రపంచ విస్తృతమైన యుద్ధయత్నాలు చేసేవారిని మనం అర్థం చేసుకోవచ్చు. కాని అలాంటి యత్నాలు చేసేవారిని ఖండిస్తూ కూడా తేలిపోని అనుమానాలకు గురిఅవుతూ, వాటిని ప్రచారం చేసేవారివల్ల ప్రమాదమున్నది. క్లిష్ట సమయంలో ఏదో ఒక పక్షాన్ని బలపరచ వలసిన తరుణంలో ఆపని చెయ్యటానికి తగినంత సాహసం లేని వాళ్లే ఇలాంటి వైఖరి అవలంబిస్తారు — కురుక్షేత్ర సంగ్రామంలో కర్ణుడు భీష్ముడి మీద అలిగి పదిరోజులపాటు యుద్ధానికి రాకుండా ముఖం తప్పించినట్లు.

రష్యాను గురించి ఇలాంటివారి వైఖరి ఏధోరణిలో ఉంటుందంటే: రష్యా చేసినదంతా రైటూ, అమెరికా చేసినదంతా తప్పూనా? అమెరికా చేసేది బాగా లేదని ఎవరన్నారు గాని, రష్యా ఏమీ చెయ్యందే యిన్ని దేశాలూ ఏకమై రష్యాను చితకపొడవాలని చూస్తున్నాయా? అట్లా అనటం రష్యాపట్ల మూఢభక్తి కాక యింకేమవుతుంది? ఈ అనుమాన పిశాచమే బ్రిటిష్ వారపత్రిక రష్యాకు ఒక హెచ్చరిక చేసింది: "మీమీద అందరికీ అనుమానాలు పోవాలంటే మీరు కొన్ని పనులు చెయ్యండి. అమెరికామీద అనుమానాలు పోగొట్టుకోవటానికి అమెరికా ఏంచెయ్యాలో సూచించండి" అన్నది. ఈ పత్రిక తనకు రష్యాపైగల అనుమానాలను గురించే గాక రష్యాకు అమెరికాపట్ల గల అనుమానాలను గురించి కూడా ఆలోచిస్తున్నట్లు కనిపిస్తుంది.

రష్యాపై తనకుగల అనుమానాలు పోవాలంటే రష్యా ఆస్ట్రియాతో సంధికి ఒప్పుకోవాలనీ, యూగోస్లావియాతో రాజకీయ సమరం నిలుపు చెయ్యాలనీ, ఐక్యరాజ్య సమితిని ప్రచారార్థం కాక ప్రయోజనార్థం వినియోగించాలనీ, వివిధ దేశ ప్రజలను రష్యాకు స్వేచ్ఛగా రానివ్వాలనీ ఈ పత్రిక సూచించింది! బ్రిటన్, అమెరికా, ఫ్రాన్స్, బెల్జియం, లక్సెంబర్గ్, స్కాండినేవియా, కెనడా, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, దక్షిణ అమెరికా, జర్మనీ, స్పెయిను, జపాను, ఇటలీ, టర్కీ వగైరా వగైరా దేశాలన్నీ రష్యామీద కత్తికట్టటానికి సన్నాహాలు ఇవాళ యుద్ధం ఆఖరైన మర్నాటినుంచే అమెరికాకు లోబడి బ్రిటన్, ఫ్రాన్సులు రష్యా వ్యతిరేకమైన యుద్ధకాల ఒడంబడికలన్నిటికీ తిలోదకాలివ్వటం చూస్తూ కూడా ఇటలీ సంధి ఒడంబడికను ఇప్పటికే రద్దు చేస్తున్నారు. ఆస్ట్రియా సంధి ఒడంబడికను అమెరికా కుట్రలపై ఆమోదించక పోవటం రష్యాపై అనుమాన పిశాచాన్ని లేవదీసిందన్నమాట.

రష్యాలో తన రాజకీయ - సాంఘిక వ్యవస్థ పుట్టిననాటినుండి అంతర్జాతీయ రాజకీయాలలో రెండు మార్పులు జరిగాయి. (1) రష్యాపై పెట్టుబడిదారీ దేశాలు కత్తి కట్టాయి. (2) రష్యాను ఇతర దేశాలనుంచి లాభం పొంద వలసిన ఆగత్యం పోయింది. మొదటి ప్రపంచ యుద్ధం అయిపోగానే రష్యాపైకి తమ సేనలను పంపిన రాజ్యాలు రెండో ప్రపంచ యుద్ధంనాటికి రష్యాను నాశనం చెయ్యటానికే హిట్లరును ప్రోత్సహించాయి. హిట్లరు తమ చెప్పుచేతుల్లో లేడని తెలిసిన తర్వాత వాడిమీద యుద్ధం ప్రకటించాయి. ఆ యుద్ధకాలంలో విధిలేక రష్యాతో చేతులు కలిపాయి. ఆ సమయంలో కూడా ఈ దేశాలు ఒక్క హిట్లరు వినాశనమే కోరలేదు, రష్యా వినాశనంకూడా కోరాయి. అందుకే చర్చిల్ గారు ఎంతకాలానికీ యూరోప్‌లో సెకండ్ ఫ్రంట్ ఏర్పాటు

కథానిక

# గోడమీద నీడలు

"విశ్వమిత్ర"

తలుపు చప్పుడుతో పాటు వెంకట్రావు గొంతు కూడా విన్న సత్యం, వాడి గొంతు గుర్తుపట్టి తలుపు తియ్యకుండానే, "గదిలో కూర్చోరా. వొస్తున్నాను" అని మళ్లీ వెంటనే "సుందరి మెచ్చిందా?" అన్నాడు. వెంకట్రావు పక్క గదిలోకి వెళ్తూ "అహాఁ! నేనూ రమణా వొచ్చాం!" అన్నాడు.

వెంకట్రావు ఈ ఆఖరి మాటలు అంటుండగానే సత్యం భార్య గదిలో కొస్తూ, సత్యానికి చొక్కా యిస్తూ "రమణ ఎవరు?" అంది. అంతవరకు సత్యం స్నేహబృందంలో ఆ పేరు విని వుండక పోవటం మూలాన.

ఆలస్యమైపోతోందనే తొందర్లో సత్యం "మా క్లాస్ మేట్ లే!" అని ఇందిర దగ్గర్నుంచి షర్టు తీసుకుని గబగబా తొడుక్కుని వెంకట్రావుని వుండమన్న గదిలోకి తొందరగా పోవటానికి ప్రయత్నించాడు.

"రమణ" పేరు వినంగానే ఇందిరకి ముల్లు గుచ్చుకున్నట్టయింది.

"రమణ కూడా మీ క్లాస్ మేటేనా?" రమణనిగురించి ఆరాతీయాలని ఇందిర సత్యాన్ని అడిగింది.

"అనేగా ఇప్పుడు చెప్పింది!" విసుక్కుంటూ అనేసి సత్యం గది దాటిపోయాడు.

రీడింగ్ రూమ్ తలుపులు కన్నాలు లేక పోవటం వల్ల "ఇందిర" మనసులో ఒక్కసారి తిట్టుకుని కనీసం వినటానికన్నా ప్రయత్నిద్దామని శ్రద్ధగా చెవులు రిక్కించింది.

అప్పుడే ఆ గదిలోకి ప్రవేశించిన సత్యం మాటలు వినిపించినయ్.

"హాలో రమణా! అరె, ఈ పూలన్నీ ఎక్కడ తెచ్చారు?" జేబురుమాలు మూట విప్పుతూ సత్యం అడిగాడు.

వెంకట్రావన్నాడు "రాధ వాళ్ళింట్లో కోసుకొచ్చాం!" అని.

"వెరీ మెనీ థ్యాంక్స్!..." అని ఇంకా సత్యం ఏమిటో చెప్పబోతుండగా కొడుకు గట్టిగా ఏడవటం వినిపించింది. ఇందిరకి వొళ్లు మండింది. వెధవ. ఇప్పుడే లేవాలీ నిద్ర! ఐనా కాసేపేడ్చి వాడే వూరుకుంటాడ్లే అనుకుని ఇంకా వినటానికి ప్రయత్నిస్తోంది ఇందిర.

ఇంతలోకే పక్కగదిలోంచి సత్యం వొచ్చి, "అబ్బబ్బ, ఒక వెధవగోల - వాడేడుస్తుంటే కాసేపు తీసుకోకూడదూ? కొంపకి కొత్తవాళ్లు వచ్చినాకూడా ఛీఛీ" కొడుకు ఇదివరకెన్నిసార్లేడ్చినా ఏమీ అనని సత్యం ఆనాడు ఇందిర మీద విరుచుకు పడటం చూస్తే ఇందిరకి చాలా బాధ కలిగింది. సామాన్యంగా భర్తలకెప్పుడెప్పుడు చిరాకులు కలుగుతుంటయ్యో తెలుసుకుంటే ఇందిర గుండెలో పిడుగు పడ్డట్టయింది.

కోపం వొచ్చింది కాని తొక్కిపట్టింది. సత్యం ఏవేవో కాసేపు తిట్టి మళ్లీ గదిలో కెళ్ళిపోయాడు. ఇందిరలో కోపం తగ్గే పద్ధతి దొరక్క అదంతా నీళ్ల రూపంలో కళ్లనుండి కారటం ప్రారంభించింది.

తలుపులు బద్దలు కొట్టి లోపలికెళ్ళి నాలుగు దులిపేద్దామనుకుంది. అడుగు ముందుకు వేసింది కాని భవిష్యత్తు కొట్టొచ్చినట్టు ఎదురుగా నిలబడ్డది. ఏమౌతుంది? సిగరెట్ తాగే కొడుకును తండ్రి, కొడుకు సిగరెట్ తాగుతుండగా పట్టుకొంటే ఏం చేస్తాడు? ఆ సమయానికి రెండు దెబ్బలు తిన్నా మర్నాటినుంచీ తండ్రి ఎదటే సిగరెట్ వెలిగించడూ? కొడుకే తండ్రిని అలా ధిక్కరిస్తుంటే తనెంత? "అడగటానికి నువ్వెవరు?" అంటే?

•

ఇందిరకి సత్యంమీదవున్న కోపం, క్రమంగా అతన్ని తనవైపు తిప్పుకోవాలి అనే విషయం మీద నిలబడి ఆమెని మంచందగ్గరికి లాక్కెళ్లింది. తలుపులన్నీ బిగించింది. సత్యం వొచ్చి

ఎంత పిలిచినాసరే తలుపు తియ్యకూడదు అనుకొంది.

కొట్టి నిద్రపుచ్చిన కొడుకువంక జాలిగా చూస్తూ, దగ్గరగా తీసుకొని అవలింతలొస్తుంటే పట్టుగా కూర్చోవాలనుకొంది కాని తనకి తెలీకుండానే ఎప్పుడో గాఢ నిద్రలో మునిగింది.

సగం రాత్రి అయిన తర్వాత కొడుక్కి మెలుకువ వొచ్చి చుట్టు చూసేసరికి అమ్మ కౌగిట్లో వుండటం చూసి రాత్రి కొట్టిన విషయం జ్ఞాపకంవచ్చి విసురుగా ఇవతలకొచ్చాడు. అంతటితో కోపం తీరలేదు.

* * *

చదువు పూర్తయేటప్పటికి రాత్రి పన్నెండు దాటటంవల్ల, వెంకట్రావు రమణా లేచారు.

ఇక్కడ పడుకోరాదూ!" అన్నాడు సత్యం.

రమణ మాట్లాడ్లేదు గాని వెంకట్రావు అన్నాడు నవ్వి—

"నీ మొహంలే! ఆమాట గట్టిగా అనకు–నీ పెళ్లాం తంతుంది!"

"అదెప్పుడో నిద్రపోయుంటుంది!" అన్నాడు సత్యం రమణవంక చూస్తూ.

"వెళ్ళొస్తాం" అన్న రమణ చూపుల్లో అర్థాన్ని గ్రహించి వెంకట్రావు "పద" అన్నాడు.

ముందు వెంకట్రావు వెనక రమణా బయల్దేరారు.

వెంకట్రావునీ, రమణనీ సాగనంపాక సత్యం గేటు వేసేసి రీడింగు రూమ్‌లోకి వెళ్ళబోతుండగా తన బెడ్‌రూమ్‌లోంచి ఏవో మాటలు వినపడటంవల్ల ఆశ్చర్యపోయి గోడకి చెవులు ఆనించాడు. మాటలు వినపడుతున్నయ్. కాని అస్పష్టంగా బాధగావున్నయ్. పైగా ఆ మాటల ధోరణి సత్యం గుండెని ఊపిరి పీల్చుకోనీక పోవటంవల్ల సరిగా వినిపించలేదు.

ఇందిర గొంతు గట్టిగానే వినిపిస్తోంది గాని రెండో గొంతు ఎవరిదో సరిగా గుర్తు పట్టలేకపోయాడు సత్యం.

"అబ్బ! దొంగలు!" ఇందిర గొంతు స్పష్టంగా వినిపించింది.

"ఊహూఁ!" కోపంగా గోరగా వినిపించింది రెండో గొంతు.

"ఎందుకింత కోపం నామీద?" ఇందిర అంటోంది.

దీనికి సమాధానమేమొస్తుందో అని సత్యం జాగ్రత్తగా వినటానికి ప్రయత్నించాడు గాని అసలు సమాధానమే రాలేదు.

"పోయిందా కోపం?" మళ్ళీ ఇందిరే అంది: అక్కడ తగ్గిన కోపం ఇక్కడ సత్యం వొంట్లోకి ఎక్కింది.

తలుపులు బద్దలుకొట్టి ఇద్దర్నీ బైటికి గెంటేద్దామనుకున్నాడు. కాని ఇంకా ఏంమాట్లాడుకొంటారో అన్న ఉత్సాహం అతన్ని ఆ పని చేయటంనుంచి విరమింప చేసింది.

త్వరగా గట్టిగా ముద్దుపెట్టుకొన్న చప్పుడైంది.

"...అబ్బ! గొరుకుతావేం?" ..అది ఇందిర గొంతు...

మళ్ళీ కాసేపటికి ఇందిర గొంతే వినిపించింది—"...ఇక్లో..." అని.

సత్యానికి ఏం చేయటానికీ తోచలేదు. లేకపోతే తలుపులు బద్దలుకొట్టి లోపలికి ప్రవేశించేవాడే!

మూర్ఛనుంచి తేరుకున్న వాడిలా చివరిగా కాసేపటికి తెలివిలోకి వొచ్చి "ఏం చేయాలప్పుడు?" అని ప్రశ్నించుకున్నాడు.

తన తెలివిని మోటుగా వుపయోగించటం ఇష్టంలేక ఆ రాత్రికి ఓపిగ్గా తన రీడింగ్ రూమ్‌లోనే పడుకోటానికి నిశ్చయించుకొన్నాడు.

గదినిండా అప్పటిదాకా, వెంకట్రావూ రమణా, తనూ కలిసి తుంపిపోసిన పూల వాసన ఘాటుగా కొడుతుంటే సత్యానికి తొందరలోనే గాఢనిద్ర పట్టింది.

తెల్లవారి లేచేటప్పటికి ఆరుకొట్టింది. అప్పటికింకా ఇందిర నిద్ర లేవలేదు. ప్రాక్టికల్ ఎనిమిదింటికే అవటంవల్ల "సత్యం" ఇందిర మీద కోపంతో లేచి గబగబా పళ్ళుతోమి మొహం కడుక్కొని కాఫీతాగి అటునించి అటే పరీక్ష కెళ్ళాడు. రాత్రి విన్న మాటలు సత్యం చెవుల్లో గింగురుమంటూనే వున్నయ్.

ఇల్లుదాటి ఎంతదూరంగా వెళ్తే అంత దగ్గరగా వినిపిస్తున్నయ్ ఆ మాటలు సత్యం చెవుల్లో.

ఇందిర నిద్ర లేచేటప్పటికి ఏడుదాటింది. అప్పటికైనా పనిమనిషి వొచ్చి నిద్రలేపటం వల్ల.

గది చిమ్మటానికి వెళ్లిన పనిమనిషి గదిలో రకరకాల పూలు రేకలు విరిగి నలిగి పడి వుండటం చూసి ఆశ్చర్యపడి ఇందిరతో మనవి చేసుకొంది. ఇందిర గదిలో కొచ్చి చూసింది. నలిగిపోయిన పూల వాసన ఇంకా ఘాటుగా తగుల్తూనేవుంది. ఆ పూలన్నీ చూడగానే ఇందిర మనసులో రాత్రి అనుభవాన్ని తెలికి నట్టయింది. ఆ గదిలో ఓచోట జేబు రుమాలు పడేసివుంది. సత్యానిది కాదని తెలిసిన ఇందిర దాన్ని పరీక్షగా చూడగా దానిమీద 'రమణ' అన్న మాట రంగు అక్షరాల్లో కన్పించింది. సెంటు వాసనతో ఆ జేబురుమాలు ఆ గదిని పవిత్రం చేస్తోంది. సత్యంమీది కసినంతనీ ఇందిర ఆజేబు రుమాల్ని కాలితో తొక్కెయ్యటంతో తీర్చుకో లేక పోయింది.

పూలన్నీ చిమ్మించి గదిలో ఓచోట కుప్ప పోయించింది ఇందిర. తన కెన్నో శ్రీరంగ నీతులు చెప్పిన సత్యం ఇంత నీచంగా ప్రవర్తిస్తాడని ఇందిర ఎప్పుడూ కలలో కూడా అనుకో లేదు. గదిలో నలిగిన పూలు, రంగు దారాలతో రమణ అని కుట్టబడిన జేబురుమాలూ, పొద్దున్నే సత్యం తనకంటే ముందే లేచి జాగ్రత్తగా పారిపోవటం ఇంకా ఇటువంటి విషయాలెన్నో సత్యం చెడు ప్రవర్తనని రుజువుచేస్తూ సాక్ష్యం చెప్తున్నట్టు అనిపించింది ఇందిరకి.

సత్యం తన స్నేహితులందర్నీ గురించి చాలా సార్లు చెప్పాడు గాని ఎప్పుడూ రమణ పేరు చెప్పలేదు. రాత్రి అడిగినప్పుడు కూడా విసుక్కుని, "మా క్లాస్ మేట్ లే" అనటం కూడా ఇందిరకి జ్ఞాపకం వొచ్చింది. ఇందులో కావలసినంత అర్థం వుందని ఇందిర అప్పుడే పసికట్టింది.

సత్యం రాగానే ఘూడించాలనుకుంది. ఏ విధంగా మొదలుపెట్టి సత్యంచేత నిజాన్ని బైట పెట్టిద్దామా అని ఆలోచిస్తూ ఇందిర మూడు గంటలూ గడిపింది.

టకటక బూట్సులు చప్పుడు చేసుకొంటూ సత్యం గదిలోకొచ్చాడు. తన రాకని గమనించక పోవటంవల్ల ఒక పాడిదగ్గు దగ్గి, ఐనా ఇందిర రానందున స్వయంగానే బూట్లు విప్పుకొని 'కాఫీ' అని అరిచాడు.

మౌనంతో రాత్రి తను విన్న మాటలు ముడిపెట్టి కావలసినదానికంటే ఎంతో ఎక్కువ అర్థాన్ని తయారు చేసుకొన్నాడు సత్యం.

ఇందిర కాఫీ తేవటానికి వంటింట్లోకి వెళ్ళింది. కావాలని చాలా ఆలస్యం చేస్తోంది ఇందిర, భర్త ఏం చేస్తాడో చూదామని.

తన మొహం చూడలేక పోవటానికి ప్రత్యేక కారణం ఇంకోటేదీ కనిపించలేదు సత్యానికి. దాంతోపాటు తను చెప్పకుండా పొద్దున్నే వెళ్ళిపోవటం వల్ల 'నాకు తెలిసే వుంటుందని తెలుసుకొని రిసెంట్' ఔతోందనుకొన్నాడు సత్యం.

నిదానంగా ఓ పావుగంటకి ఓ అరకప్పు కాఫీ పట్టుకొచ్చి బల్లమీద పెట్టి వెళ్ళిపోతోంది ఇందిర.

తన శాంతం. సత్యంలో గొప్ప మార్పు తీసుకురాక తప్పదన్నట్టు ఇందిర మాట్లాడటం మానేసింది.

కాఫీకప్పు బల్లమీద పెట్టేటప్పుడు సత్యం కళ్ళల్లోకి ఇందిర తప్పనిసరిగా చూడాల్సొచ్చింది. సత్యం కళ్లు ఎర్రగా వుండటానికి కారణం ఇందిరకి అర్థమైనట్టు అటుపక్కకి తిరిగి కిందిపెదవిని పళ్ళసందున ఇరికించింది. ఇందిర కళ్లు ఎర్రగా వుండటానికి కారణం కూడా అర్థమైనట్టు సత్యం తల నిలువుగా ఆడించాడు.

ఇందిర వంటింట్లోకి వెళ్ళేటప్పటికి కొడుకు పంచదార సీసాలో చెయ్యిపెట్టి గుప్పెడు ఒక్కసారే తినటానికి ప్రయత్నిస్తుంటే వెనగ్గా వెళ్ళి ఇందిర, వాడి పిర్రమీద ఓటి వడ్డించింది. జాలిగా కోపంగా చూశాడు.

జాలేసి చంకలో కెక్కించుకుంది ఇందిర. ఇంతలో హాల్లో ఏవో మాటలు వినిపించినయ్.

"హలో రమణా! కమాన్. ఎలా రాశారు పరీక్ష—? ఏమైపోయింది?..."

టకటక ప్రశ్నల వర్షం కురిపించాడు

సత్యం. ఇందిర తెల్లబోయింది. "ఎవరు రమణ?" సెమీసూట్‌లో వున్న ఆ సన్నటి పెద్దమనిషా?"

"మల్లెపువ్వొచ్చిందండి - రాత్రి మనం చూశాంగా, బాగానే రాశాను. అన్నట్టు రాత్రి నా జేబు రుమాలేదైనా ఇక్కడ మరిచి పోయానా?"

ఈ మాటలు పూర్తిగా అనకముందే ఇందిర లోపల్లోపల నవ్వుకుంటూ తలుపు సందులోంచి జేబు రుమాలు ఇవతల పడేసింది.

ఇందిర చేసిన ఆ పని సత్యానికి వొళ్లు మరిపించింది. రమణతో మాట్లాడుతున్నాడన్న మాటేగానీ దృష్టంతా ఇందిరమీదే వుంది.

కోపంగా కొడుకు ఇందిర జుట్టు పీకుతుంటే "అబ్బ-వొదులు" అని వొదిలించుకుంది ఇందిర వాడితో కష్టంతో పోట్లాడి.

"అబ్బ! గిల్లుతావేం?"... చెయ్యి వెనక్కి తీసిపెట్టింది ఇందిర.

కుర్రాడు ఏడవ పోతుంటే—

"కోపమొచ్చిందా?"... అని ఇందిర వాణ్ణి గట్టిగా ముద్దు పెట్టుకుంది—

"ఇటో .."అని రెండో వైపుకూడా ముద్దు పెట్టుకున్న తర్వాత "ఈ సారి కొరికావంటేనా...!" నవ్వుతూ అంది ఇందిర.

సత్యం గుక్క తిప్పుకోలేక పోయాడు. గబ, గబా పరుగెత్తుకు వెళ్లి నుంచున్న ఇందిరను అమాంతంగా కౌగిట్లోకి తీసుకున్నాడు.



# పిల్లలు — పెద్దలు

"రమణశ్రీ"

నేను పిల్లల్ని పాడుచేస్తున్నానని మా శ్రీదేవి ఒకటే గొడవ గోలా. ఆడతుమ్మెద లాగ చెవుల్లో గింగుర్లెత్తించేది. నిజంగా నాదే తప్పయితే, మా శ్రీదేవి యిచ్చే ప్రేమపూర్వకమైన శిక్షలకు అర్హుణ్ణే. ఆ [illegible] నాకు తెలీదేమో ఋజువు చేసుకుంటూ.

* * *

స్కూలు కుర్రాళ్ల గోలలోంచి తప్పించుకొని ఇంటిముఖం పట్టేసరికి చెమటలు పట్టి తల ప్రాణం తోకకొస్తుంది.

"ట్రెయినింగ్‌లో చదివివచ్చిన బాల బాలికా మనస్తత్వ సూత్రాలు [illegible] అమలు జరపుదామని ఎంత ఏడిస్తే గొర్రెల మంద ఊరుకుంటేనా! ఒక్కొక్క గొర్రె కొండను ఢీకొట్టేటంత పనిచేసేది. ఒక్క వెధవని కొట్టకుండా నెట్టుకొద్దామనుకుంటే మన నెత్తిమీద రాళ్లు విసురుతున్నారు. వట్టి మేకల మందంటే నమ్మండి. (అందులో కొందరు మేకల్లా అరిచేవాళ్లు కూడా వున్నారు)

ఇంటికి రాగానే మా శ్రీదేవి వంటిమీద చేయివేసేసరికి, విసుక్కుంటూ పోయేది. అమ్మయ్య అని కుర్చీమీద కాలు వేయబోయేసరికి, కాల భటులు ప్రత్యక్షం! ఒకడు జుట్టుపీక, మరొకడు వాడికి సహాయంగా- మా పూర్వాసవాసనా ఫలితం-ఓ పెద్ద పిడినిలాగ, వీళ్ళిద్దరినీ రక్షించుకొనేసరికి మా బాపనయ్య- ఆరేళ్లు ఇంకా రాలేదు లెండి- తొడ సింహాసనం ఎక్కేసేవాడు.

ఆ సింహాసనం మీదనుంచి పడగొడదామని మా రెండోవాడి ప్రయత్నం ధ్రువుడికి మల్లే. వాడుగూడా సరాసరి ఆ సింహాసనం సురాక్రమణ చేసేయడానికి ఉపక్రమించాడు. మా రెండోవాడు ధ్రువుడికంటె రెండాకు లెక్కువే చదివాడు లెండి!

తపుక్కున ఉత్తముడిలాంటి మా చిన్న కొడుకు బాపనయ్యగాణ్ణి లాగిపారేసి, ఆచోటు దురాక్రమణ చేశాడు. అబ్బబ్బ! ఎక్కువ వెధవ తిన్నగా వున్నాడా! సిసింద్రీ వెధవ! తొడమీద కాళ్ళమీద వెంట్రుకల్ని సాగలాగి, అవి బోడి పెలు కడుతూంటే "మాణ్ణాన్నా! భలే!

నేను గట్టిగా కేకవేశాను. "చచ్చు గాడిద కొడకా! దిగు, దిగు. వీణ్ణివ్వాళ నరికేస్తాను. ఏబ్రాసిగాడిదా దిగు- దింపండి."

ఇంకా కోపం నటిస్తూనేవున్నా. ఆయన నా నోరు నొక్కాడు. చచ్చినంత సిగ్గువేసింది. నావైపు తీవ్రంగా చూచి, తీసుకుపోయాడు.

"ఇల్లాగైతే ఎల్లాగరా నాయనా! మా సంసారమంతా నీపాలి నరకమై పోతోందిరా బాబు" మా అమ్మ రోజల్లా ఒకటే గొడవ.

ఎవరూ ఒక మెతుకన్నా గతకలేదు. ఆ రోజు నాకు బతుకే లేదన్నమాట. ఒకరికన్నా ఒకరికి బింకం. టంకం వేసుకుపోయి, కదల్లేను. ప్రక్కింటాయన కుర్రాణ్ణి తీసుకవచ్చి, మా ఆవిణ్ణి నన్ను ఓదార్చి, పోకార్చి, ఒక తీరులోకి తీసుకొచ్చాడు. ఇద్దరం రాజీకి కుదిరేం ఎలాగో.

ప్రక్కింటాయన చేసిన ఉపకారం మరవరాని ఘట్టం. ఆయనకు కృతజ్ఞతగా నాకు మగోబిడ్డ పుట్టే ఆశవుంటే ఆయన పేరు, లింగానుగుణంగా మార్చిపెట్టుకో వచ్చునని తాత్కాలికంగా నిశ్చయించుకున్నా.

ఆ రోజలా తెల్లవారిపోతే మహాబాగున్నది. మర్నాటినుంచి మా గొడవ మాకు తప్పలేదు.

మా ప్రక్కింటాయన రోజూ రావటం, కుర్రాళ్ళకు పంచదార బిళ్ళలు, పళ్ళూ, అవీ యివీ పెట్టి మచ్చిక చేసుకునేవాడు వాళ్ళతో వాళ్ళ భాషలో మాట్లాడి ఆనందించేవాడు. సరిసమానంగా ఆడేవాడట కూడానూ. అదేం సరదావో గాని!

మా శ్రీదేవి దానికి బాగా దెప్పిపొడిచేది. "ఆయన మాత్రం తెలివితేటలు కూడా బంసుక్నే మీకు! ఎంత బాగా ఆడిస్తున్నారో పిల్లల్ని. ఏ ఆడదాడించ గలదండీ? ఎంత గుక్క పట్టి ఏడ్చేవాడైనా పిల్లలాగైపోతా డాయన దగ్గర. ఆయనకెంత సరదావో!"

నాకు సరదా లేదని గామోసు? ఇంతకూ నాకు బాదడం తప్ప ఏంరాదనేది. నేనేం జేయను? నా తప్పా మరి?

ఒకనాడు మా రెండోవాడు పరుగెత్తుకుంటూ నావళ్ళో వచ్చి పడ్డాడు. "ఛీ" అని విదిలించేశా.

మా శ్రీదేవి అందుకుని "అదే వచ్చేది మరి! వాడెంతో సంతోషంతో ఏదో చెప్పాదామని ఉరకలేసుకుంటూ వస్తే విసిరి కొట్టుకుంటారేం" అని పెదవులు విరిచి కోరగా చూచింది.

మా వాడు చెప్పుకుపోతున్నాడు.

"నేనూ, మన పక్కింటాయనా గోళీ కాయలాడేం — నాన్నా! చెప్పకొక్కనీ, ఆయనే వోడిపోయేవోడేవ్. పాపలా వొచ్చిండేవ్. అమ్మా సినిమా కెళ్ళాక. అంతదూరంలో ఉండగానే కొట్టేసేవాణ్ణి ఆయన కాయదగ్గరున్నా ఉక్కేసేది. ఆయనకొద్దం చేతరాదు నాన్నా, రోజూ ఆడదాం రమ్మంటున్నాడు నాన్నా. వెల్తానే నాకు చాలా చాలా."

"అపు వెధవా!" అన్నా గట్టిగా.

"ఎక్కడరా ఆడటం" అంది శ్రీదేవి.

"వాళ్ళ దొడ్లోనే. రెండు కంటాలు తీశాడాయనే. ఎవరన్నా మాస్తే బాగోదన్నాడేవ్."

శ్రీదేవి ముఖం వికసించి నవ్వు విరిసింది.

ఆఫీసులో బంట్రోతు ఉద్యోగానికి దరఖాస్తు పెట్టుకున్న పదహారేళ్ళ కుర్రాడిని పరీక్షిస్తున్నాడు మేనేజరు.

"నీ పేరు?" కుర్రాడి సమాధానం: "పోతన్న అంటారండి."

"ఇంటిపేరు?" వివరంగా అడిగాడు మేనేజరు.

"బమ్మెరవారండి."

"ఎక్కడో విన్న పేరులాగుందే!"

"వినే ఉంటారండి. నాలుగేళ్ళనుండి నేను యీ వీధిలోనే నౌఖరీ చేస్తున్నాను" అన్నాడు కుర్రాడు.

# మంచిపిల్ల సంపంగి

(కథానిక)

"ఇంకేం కావాలి?" అడిగాడు కూరల వర్తకుడు.

"వీశె బంగాళీ దుంపలు వెయ్యి" అన్నాడు రామదాసు.

"రామదాసూ! ఎప్పుడు పెళ్ళి చేసుకుంటావురా, తమ్ముడూ! ముప్పై దాటిపోతూంది. నలభయ్యోపడిలో నడ్డి వంగిపోయి నడవలేక పోతున్నప్పుడు చేసుకుంటావా? ఖర్మకాలి, అప్పుడు చేసుకున్నా ఏం అనుభవించగలవు? ఎవరికో ఒకరికి ధారాదత్తం చెయ్యవలసిందే-కన్యని!" అన్నాడు వీశె దుంపలూ, రామదాసు సంచిలో పోస్తూ వర్తకుడు.

రామదాసు సిగ్గునభినయం చేశాడు.

"ఇంకేం కావాలి?" అడిగాడు మళ్ళీ వర్తకుడు.

"పావువీశె నక్కదోసకాయలు పడేయ్. అయ్యగారికి అవి చాలా యిష్టం" అన్నాడు రామదాసు. "అయ్యగారికవంటే మహా ప్రేమ."

"అయ్యగారి ప్రేమ నక్కదోసకాయల మీద. మరి నీ ప్రేమ ఎవరిమీద రామదాసూ! ఎవరినైనా ప్రేమించావా లేదా? ఇంత నీ దీర్ఘజీవితంలో ఒక్కగానొక్కతెని ఎవర్తెనో ప్రేమించలేకపోయావూ? ప్రేమ పుట్టలేదా ఏమిటి? లేక ఊళ్ళో నీకు నచ్చిన అమ్మాయి ఎవర్తీ దొరకలేదా? అతుంటున్నారు. ఒక్కసారి కన్నుగీటితే, ఎవర్తో ఒక అనాథురాలు నిన్ను వివాహం చేసుకోడానికి అంగీకరించి వుండదా? అసలు నువ్వు మొద్దువి, పిసనారైన పాషాణానివి, నీకు ప్రేమేమిటిలే నా మొహం. నీపని ఎల్లప్పుడూ కూరల సంచి చేత్తో పట్టుకుని తిరగడమే! అటుపైని పాకగేహవ్యాయామం" అన్నాడు వర్తకుడు.

"మిరపకాయలు పావుశేరు కేతునా?" అడిగాడు వర్తకుడు.

రామదాసు హృదయంలో మిరపకాయ చిదిమినట్లయింది. కూరల వర్తకుడి మాటల్లోని ఎత్తిపొడుపు కారం నసాళానికి అంటుకుంది.

"చాలు. మరేమీ అక్కర్లా" అంటూ సరుకు మూల్యం అణాపైసలతో సహా చెల్లించి అంగడిలోంచి త్వరత్వరగా నిష్క్రమణం సాగించాడు.

కాలు ముందుకు పడలేదు రామదాసుకి. బలవంతంగా అడుగుతీసి అడుగు వేస్తున్నాడు. కూరలతట్టి అన్న మాటలే చెవుల్లో గింగురుమంటున్నాయి.

"ఎంతమాటన్నాడు! నాకు ప్రేమ లేకపోవడమేమిటి? కొలెడంత వుంది నాలో. కనబడ్డ ప్రతి స్త్రీనీ ప్రేమిస్తూనే వున్నాను తరతమ భేదం లేకుండా. నాలో యెంత ప్రేముంటే ఏం లాభం? నా ప్రేమ ఎవరిక్కావాలి? డబ్బులేని నన్ను ఏ స్త్రీ ప్రేమిస్తుంది? వ్యక్తిత్వం, స్వయం సామర్థ్యం లేని నన్ను ఎవర్తె ప్రేమించి, పెళ్ళి చేసుకుంటుంది? చేసుకోదు. నావంక తేరిచూడనైనా చూడదు. చూస్తుంది. ఎప్పుడు చూస్తుంది, నేను కారులో వూరేగుతూ జేబులోని ధనం చిత్తుగా ఖర్చుపెడుతూ లీవిగా దర్జాగా బ్రతుకుతున్నప్పుడు.

నా బ్రతుక్కి కారూ, చిత్తుగా ధనం ఖర్చుపెట్టడం కూడానా! నా లీవి అంతా వంటింట్లో పొయ్యి దగ్గర, పాత్రసామగ్రి ముందు, కూరగాయల ముందూ చూపించాలి. ఇంత లీవీ, దర్జా అయ్యగారి కాలిబూటు చప్పుడు వినగానే పరిసమాప్తి. మేఘం పొంచివిడ్చినట్టు ఒక్కసారి విడిపోతుంది. మళ్ళీ నేను ఎప్పటి దరిద్రుణ్ణే. పాత వంటమనిషి రామదాసునే. చుట్టముక్క కొనుక్కొందుకు కాని చేతలేని కబోదినే.

ఇల్లాంటి వాడు పిలిచి పిల్లనెవరిస్తారు? ఏం చెయ్యాడం? ఏది గత్యంతరం?—

బులుసు-బీ-ప్రకాశ్

తలనిండా ఉష్ణజల ప్రవాహాలు.

రామదాసుకి నౌకరీ ఫీ అనిపించింది. "దీని కింక స్వస్తి చెప్పేస్తాను. ఇంకులో ఎటుగూ బొదుగూ లేదు నాకు. కమ్మగా పంటైన కూలీల జట్టులో చేరి, కూలీ తెచ్చుకుంటాను. దినానికి కొంత చొప్పున ధనం కూడ బెడతాను. తగినంత ధనం చేరబట్టుకుని అప్పుడొక స్త్రీని ప్రేమించి పెళ్ళి చేసుకుంటాను. అప్పటికిగాని నేను చవట నన్న నింద పోదు. నా అభిలాష తీరదు.

ఒక నిశ్చయానికి వచ్చిన వెనుక దించిన తల ఎత్తాడు. తనముందు పోతున్న గుర్రపుబండీలో కూర్చుని భర్తతో కాదోలం సంభాషిస్తున్న జవరాలు ఒకామె అకస్మికంగా కంటపడింది.

"ఆ యువతి ఎంతందంగా ఉంది! ఆ మెలాంటి చక్కని చుక్కనే వివాహం చేసుకోగలిగితే, ఈ రామదాసు ధన్యుడా? మహా ధన్యుడా?" అని ఉవ్విళ్లూరిపోయాడు రామదాసు.



"రామదాసూ! నీచేతి టీ ఇవాళ అమృతోపమానంగా వుంది. ఏం వేసి చేశావో!" అయ్యగారు మిక్కిలి అభినందించారు రామదాసు టీ మిశ్రీకరణ నైపుణ్యాన్ని—

"అబద్ధం అయ్యగారూ! ఈనాటి టీ బాగుండదు. నేను సరిగ్గా కలిపి యివ్వలేదు. నన్ను ఎగతాళిచేసి ఏడిపించకండి" రామదాసు వినయంగా ప్రతిమాలుతున్నాడు యజమానిని.

"మనస్ఫూర్తిగా చెయ్యలేదూ?" అడిగాడు టీ కప్పు టేబిల్ పై వుంచుతూ యజమాని—

"మనస్సు బాగోలేదండి దొరగారూ!" అన్నాడు రామదాసు అతి బాధగా—

"సుస్తీగా వుందేమిటి ఒంట్లో?" అడిగాడు యజమాని.

"లేదండి. చిరాకుగావుంది, మనసులోనే" బదులు చెప్పాడు పాకకళా విశారదుడు.

"బంధువులకెవరికైనా అనారోగ్యంగా వున్నట్టు వార్త వచ్చిందా?" అయ్యగారు ప్రశ్నించారు.

"ఈ మనోవ్యథ అంతా నాకు సంబంధించిందే." అన్నాడు రామదాసు.

"ఎందుకు రామదాసూ నీకీ మనోబాధ?"

"ఇన్నాళ్ళూ ప్రేమతో ఆదరించి, పోషించిన అయ్యగారిని ఎలా విడవడమా? అన్నదే చింత" రామదాసు జవాబు—

"విడవవలసిన అవసరం ఎందుకొచ్చిందో?"

"ఆత్మీయం దొరగారూ." నసిగాడు.

"నాతో చెప్పకూడదా రామదాసూ! నీకేం శత్రువుని కాను. చెబితే నాచేతనైనంత సహాయం చేస్తాను. చేసి తీరుతా. సిగ్గూ, భయమూ, రెండూ విడిచిపెట్టి, నీ మనసులోని అభిప్రాయమేమిటో నాతో నిక్కచ్చిగా చెప్పు" అన్నాడు యజమాని.

రామదాసు చెప్పలేక పోతున్నాడు.

"భయపడక చెప్పు" అని యజమాని ధైర్యం ఇచ్చాడు.

"ముష్కై... పెళ్ళి చేసుకుంటాను బాబుగారూ!" రామదాసు అన్నాడు.

యజమాని పకపక నవ్వుతూ "దానికి నౌకరీ విడిచిపెట్టడం ఎందుకోయ్! ఇక్కడ వుండే పెళ్లి చేసుకుంటే, ఎవరు అభ్యంతరం పెడతారు? చేసుకో, తప్పక చేసుకో. డజనుమంది భార్యల్ని పెళ్లి చేసుకో రామదాసూ. నాకూ కూడా ఆనందమే. ఈ నిర్జన వసతిలో నీకు సాయం ఎవరూ లేరని చింతిస్తున్నావు. నువ్వొక యింటివాడివైతే, నాకూ చక్కటి కాలక్షేపం.

"కూలిచేసి ధన మార్జించుకుంటానండీ బాబుగారూ." మనోగతం ఆఖరికి ఈ మాటల్తో పూర్తిగా నివేదించాడు రామదాసు

"ధనం కావాలా? ముందు సంబంధం కుదుర్చుకో. పెళ్లికెంత ఖర్చవుతుందో ఒక్క దినం గడువుండగా చెప్పు. అంతా నీకు నేనిస్తాను. వెళ్లు. కదిలి పెళ్లి సంబంధం కుదుర్చుకో." యజమాని అత్యభిమానంతో పురికొలిపాడు.

ఇంతలో రామదాసుకి ఓ సందేహం పొడమింది. అయ్యగారు ధనసహాయం చేస్తారు. అనుకున్నట్టు అందాలరాణినే ఉద్వాహం చేసుకుని తీసుకువస్తాడు. కానైతే ఆమె నిల్చేందుకు స్థలమెక్కడ? ఇప్పటికేదో అయ్యగారు తనింట్లోనే వుండమని ధ్వనిస్తున్నారు కాని, ఎన్నాళ్లుండనిస్తారు? ఆ నగరంలో అరంగుళం జాగాలేదు రామదాసుకి. నౌకరీ చేసుకుంటూ అయ్యగారి భవనంలోనే నివాసం

చేస్తున్నాడు. ఇప్పుడు "అర్థాంగి" అన్నది ఒకర్తె వస్తే ఎక్కడ పెట్టను? అద్దె ఇల్లెక్కడ తీసుకుందామన్నా అందుకు వాడు ధనహీనుడు.

యజమానికి రామదాసు బాధ అర్థమైందేమో, ఔదార్యంగా— "కొత్త భార్యకి గృహమెక్కడని ఆలోచిస్తున్నావా? ఇద్దరూ ఇక్కడే చిరకాలంవుండి. సంసారం వెళ్ళబుచ్చండి. అదిగో మీ బసకి ఆ శ్రేణి అంతా యిచ్చేశాను." అన్నాడు.

రామదాసుకి ఎక్కడలేని ఆనందమూ కలిగింది. అన్నీ సమకూడాయి. ఇక తాను తనకి నచ్చిన పిల్లని వెదికి పెళ్లి చేసుకుని వెంట తీసుకురావడమే తరువాయి—

కూరగాయల వర్తకుడి దగ్గరికి పరుగునపోయి పెళ్లి చేసుకుంటున్నానని చెప్పాడు.

"సుఖీభవ!" అని ఆశీర్వదించి పీకె బంగాళాదుంపల దగ్గిర ఒక అణా హెచ్చు గుంజుకున్నాడు వర్తకుడు.

* * *

పెళ్ళి క్లుప్తంగా ఓ రాత్రిలోనే జరిగిపోయింది. పెళ్ళికూతుర్ని వెంటదీసుకుని, రామదాసు, తుణ్ణం ఆగకుండా యజమాని గృహం చేరుకున్నాడు.

పిల్ల అందమైన పిల్లే! మల్లెపువ్వులా వుంది. పేదవారి బిడ్డ కావడాన ఆమె తల్లిదండ్రులు పేదవాడైన రామదాసుకే యిచ్చి పెళ్ళి చేశారు. అదే వారి కొస్తంత ధనికులైవుంటే ఏ ధనిక కుటుంబానికి చెందిన వ్యక్తికో జత గూర్చి వుందురు. అంతా మనుష్యుడి మాయ! వివాహానికి అతడే గ్రంథకర్త కొట్టి అతడెట్లు కూరిస్తే అట్లు నడవక తప్పదు వధువులు.

ఆమె అందమైన పిల్లే కాకుండా అతి మంచి పిల్ల అని తెలుసుకుని మరీ పెళ్లి చేసుకున్నాడు రామదాసు. తనకి అక్షరజ్ఞానం లేకపోయినా అమ్మాయి అయిదో క్లాసు వరకు చదువుకుందిట. చక్కటి పాటలు మృదువైన కంఠస్వరంతో పాడుతుందిట అన్నిటికంటే అభినందించవలసిన విషయం...ఆమె పరాయి పురుషుడెవరినీ కన్నెత్తి చూడనే చూడదట!

రామదాసు కింకేం కావాలి? సలక్షణమైన భార్య దొరికింది. యజమాని వంటగృహంలో నుండి ఉత్తరశ్రేణికి బసమార్చి, అందులోనే భార్యతో పాటు కాపురం పెట్టాడు.

తొలి మూడు రోజులూ సంపంగిని రామదాసు ఎందుకూ బలవంతం పెట్టలేదు. ఏమంటే ఇద్దరిదీ కొత్త పరిచయం. స్వతహాగా ఆమె బిడియపడుతూ వుంటుంది. అతనివద్దకు చేరటంకుకు లోలోపల జంకుతూ వుంటుంది. అట్టి సమయంలో ఆమెని రారమ్మని బలవంత పెడితే, ఆమె అతనంటే దద్దరిల్లిపోయి, చివరికెప్పుడూ కూడా అతన్ని సమీపించక పోవచ్చు. అల్లా అయితే రసభంగం. తన భావి జీవితానందానికే ఒక ఆనకట్ట. రామదాసు ఓరిమితో ఊరుకున్నాడు

అతని పని ఇప్పుడు అతి సులువుగా వున్నది. రెండు చేతులకు మరి రెండు చేతులు తోడు. సంపగి ఒక పనిచేస్తే, తానొక పని చేస్తున్నాడు. మునుపటికంటే త్వరగా జరుగుతున్నది వంట. అతి సక్రమంగా కూడా జరుగుతున్నది. యజమాని భోజనంచేసిన పిమ్మట ఆ రాజ్యానికి వారే రాణీ, రాజు. వారి చిత్తం వచ్చినట్లు కులాసాగా వ్యవహరిస్తున్నారు. యజమాని భాగ్యం తామూ అనుభవిస్తున్నారు.

యజమాని ఎన్నడూ "ఇదేమిట"ని అడగలేదు. ఔదార్య పురుషుడు. వెనకా ముందూ ఎవరూ లేరు. పెద్ద ఆస్తి-ఆయన అనుభవించగా ఇంకెందరు రెండు చేతుల్తో అనుభవించినా తరగనిది. ఇంతమాత్రాని కెందుకు ఆగ్రహిస్తాడు?

భార్యకు చీరలు కొనక్కోమని రామదాసుని పిల్చి అరవై రూపాయలిచ్చాడు. "గాజుల జత కొనితెచ్చి యిస్తానే రామదాసూ!" అని కూడా హామీ ఇచ్చాడు. మంచి రకం చీరలు కొనితెచ్చి రామదాసు, భార్య అలంకరించుకోగా చూసి, తన్మయుడైపోయాడు.

వెన్నెల రాత్రి, కిటికీలోనుండి చంద్రకిరణాలు గదిలో మంచంపై పడున్న సంపంగి ముఖంపై పడుతున్నాయి. ఆ కాంతి ధావళ్యంలో సాగర వీచికల్లా మెరిసిపోతున్నవి ఆమె నీల నిరోజాలు.

మరో కోణంలో పడున్నాడు రామదాసు. నిద్ర పట్టలేదు. సంపంగి తనకి భార్యగా అయిన

చరిత్రని జ్ఞాపకం తెచ్చుకుంటున్నాడు. అనురాగ తరళితమిళితమైంది అతని హృదయం. ఇంతవరకూ అతడామెని స్పృశించలేదు. స్పృశించి, ఆమెని తన బాహుబంధంలో ఇముడ్చుకుని నలిపెయ్యాలని అభిలాష పుట్టింది. స్త్రీని అనుభవించడానికిదే ప్రథమం. ఆ వింతేదో ఇవేళే అనుభవించాలన్న పట్టుదలతో మెల్లిగా లేచి, సంపంగి నిద్రిస్తూన్న మంచం వద్దకెళ్ళి తట్టిలేపాడు.

ఆమె హఠాత్తుగా చక్షువులు విప్పి చూసింది. భయంతో శాలువా ముసుగులో దూరిపోయింది.

"సంపంగీ!" అని మృదువుగా పిలిచాడు.

"ఉహుహుహుహుహుం" అన్నది చలికి వణికిపోతున్నట్లు నూతన వధువు.

"వెన్నెల మధురంగా ఉంది సంపంగీ! ఈవాళ కార్తీక పౌర్ణమి! ఇంత మంచి వెన్నెల మళ్ళీ ఏడాదివరకూ తిరిగిరాదు. దీన్ని మనం అనుభవించకుండా వదిలేయకూడదు. రా సంపంగీ! రా! మంచి పిల్లవి కదూ!" అని ప్రాధేయపడ్డాడు.

"నేను మంచిపిల్లనే. అల్లరి పిల్లని కాను. నన్ను చెడ్డపిల్లని చేయకండి బాబూ!" అంది సంపంగి విసుగ్గా.

రామదాసుకి ఆశ్చర్యం కలిగినా, ఆగ్రహం కలగలేదు. ఎందుకంటే ఆమె మంచి పిల్లని ఎవరో చెప్పగా విన్నాడు. మంచిపిల్ల మంచి ఊహాల్లోనే వుంటుంది. చెడ్డ ఊహాలు ఆమె మదిలో చొరబడనేరవు. ఆమె అంగీకరించకపోవడం సబబే! చెడ్డ పిల్ల కావడానికి ఇచ్ఛగిచ్చింది కాదు. చెడ్డతనం! ఈ చర్య చెడ్డది కాదూ? ఆమెని చెడు చేష్టలికి ఆహ్వానించడం తనదే తప్పనుకున్నాడు.

• • •

"నీ భార్య మంచి పిల్ల. చాలా మంచి పిల్లని పెళ్ళాడేవు రామదాసూ. అది నీ అదృష్టం. జాగ్రత్తగా చూసుకో!" అంటూ వుండేవాడు కూరల వర్తకుడు ప్రతి సాయంత్రమూ రామదాసు తనవద్దకు కూరలకోసం వచ్చినప్పుడల్లా.

"అవును భాయీ, సంపంగి మంచి పిల్లే. ఎంత మంచి పిల్లంటే ఆఖరికి పెళ్ళి చేసుకున్న నావంకైనా కన్నెత్తి తేరిచూడనంతటి మంచి పిల్ల. ఆమెకి శారీరక సుఖవాంఛ లేమీలేవు. దాని పనేదో దానిది. ఇల్లూ, వంటా, భోజనం నిద్రా, అలంకరణ-అంతే. ఆమె ఎంత పరాఙ్ముఖి అయినా మంచిపిల్ల అవడానికి నేనెంతో గర్విస్తున్నాను" అనేవాడు ప్రత్యుత్తరంగా రామదాసు.

"ఆడవాళ్లలో అంతమంచి గుణాలు అవుపించడం అరుదు. నీ భార్య మంచిపిల్ల అవడం నువ్వు చేసుకున్న తపస్సే!" కూరల వర్తకుడు మెచ్చుకునేవాడు.

రామదాసు ఆ సాయంత్రం మామూలు కన్నా కొంచెం ముందుగా వెళ్ళాడు. ముందుగా వెళ్లడంలో ప్రత్యేకతవుంది. బజారులోకి కొత్త రకం జలతారు చీరలు వచ్చాయి. నెలనెలా మిగిలిన సొమ్ముచేరి మొత్తం ముప్పై రూపాయలవరకువున్నాయ్. సంపంగికి చీర కొన్నాడు. తదుపరి కూరగాయల నిమిత్తం వర్తక స్నేహితుడి దుకాణానికి పోయాడు.

కూర్చోమని ఆహ్వానించాడు వర్తకుడు.

"మంచిపిల్ల నీ భార్య బావుందా రామదాసూ?" అని నవ్వుతూ రామదాసుని పృచ్ఛించాడు, ఎప్పటికి మల్లే-

కాని ఆ నవ్వు హృదయంలోంచి వచ్చిన సానుభూతి పూర్వకమైన నవ్వులా కనిపించలేదు రామదాసుకి. అందులో ఏవో విషపు వాసనలు వున్నట్లున్నవి. ఎందుకు నవ్వుతున్నాడు? రోజూ ఇట్లానే నవ్వుతున్నాడు. ఈ నవ్వులో ఏదో అంతర్గర్భితమైన ప్రమాదం వుండితీరాలి. తనకి కలగబోయే మహాప్రమాదాన్ని సూచించే నవ్వే యిది! కుళ్లు నవ్వు!

ఆ నవ్వు రంగు చూడలేక, ఆ నవ్వు శబ్దం వినలేక పోయాడు. ఇన్నాళ్ళూ కాలక్షేపం కోసం కొంతసేపక్కడ కూర్చుని తాపీగా ఇంటికి చేరుకునేవాడు. ఈనాడు మాత్రం అలా కాదు. తొరతొరగా కొనవలసిన కూరలేవో కొని, విలువ చెల్లించి వెంటనే గృహోన్ముఖుడయ్యాడు.

వెనకనే వినిపిస్తున్నది నవ్వు! వెకిలినవ్వు! విషపు నవ్వు. గుండెలో అంతకుముందు లేని అనుమానాలు లేస్తున్నవి. ఒళ్లు ఉడికి పోతున్నది.

అప్పటికి కాస్త చీకటి పడింది. ఇంటింటా

దీపాలు వెలిగించారు. యజమాని గృహంలో కూడా అదిగో! దీపం! ఆయన మూడు రోజుల్నుండీ అస్వస్థుడై మంచం పట్టివున్నాడు. ఇల్లు విడిచి ఎక్కడికీ పోలేదు. అతనికి పరిచర్య చేసేందుకు ఎవరైనావున్నారో లేదో. తాను బజారుకి వచ్చేవాడు. సహాయం దీపమే.

రామదాసుకి ఊదీచిత్రేణి దీపం అవుపించలేదు "ఇంత చీకటైనా, సంపంగి దీపం ఎందుకు వెలిగించలేదో! బహుశా మధ్యాహ్నం నిద్రలో వుండి వుంటుంది. కాకుంటే ఎక్కడికిపోతుంది? పొరుగిళ్ళకు వెళ్ళదు. అంతెన్నడూ గుమ్మం దిగి ఇవతలకి రాదు."

గృహ బహిర్ద్వారం దాటి ఒక్కడుగు లోనికి వేశాడు. కళ్లు తిరిగి నట్లయింది. శరీరమే పరిభ్రమిస్తోంది. ఏమిటది?

సంపంగి మంచి పిల్ల. అంత మంచి పిల్ల యజమాని లోగదిలో నుండి వ్యత్యస్త కేశాలతో పమిట సర్దుకుంటూ బయటికి వస్తున్నది.

"ఎందుకక్కడికి పోయావ్?" అని గద్దించి అడిగాడు సంపంగిని.

"యజమానికి నీరు కావలసి వస్తే అందివ్వడానికి వెళ్ళాను. వెళ్ళక తప్పింది కాదు!" అన్నదే సంపంగి సమాధానం.

దుకాణదారు నవ్వు ప్రతి ధ్వనించింది మళ్ళీ రామదాసు అభ్యష్ణ కర్ణాల్లో.

# ఊరేగింపు

యం. సూ

రామిగాడు సిపాయిల్లోగుండా యింటికి చేరకముందే వుత్తరం మళ్ళీ ఒకటి చేరింది. దానిలో "నేను వచ్చేటప్పటికి ప్రక్కవూరి పల్లెలోని 'ఈరిని' పెండ్లాడేందుకు మంచిచెడ్డలన్నీ మాట్లాడండి. వాడుకలో వున్న పేర్లకు బదులు రామయ్య, ఈరమ్మ అని వివాహ మహోత్సవ ఆహ్వానపత్రాలు అరవెయ్యి దనుక అచ్చు వేయించండి. పైసల్లో ఏమాత్రం పిక్కకుండా పేరుగన్న మేళగాండ్లను మాట్లాడటము, వూరేగింపుకు ఒక్క మోటారు టాక్సీ, పైన పూలపాలిక కుదిరించాలి. నేను వచ్చేటప్పుడు బనారసు పట్టణం నుంచే బట్టలు ఖరీదు చేస్తాను. అరుమాడైనా, మూడు ఆరైనా పల్లెలోనే కాకుండా కాపులిండ్లల్లో సహితం తూర్పున కరకర పొద్దు పొడిచిందాక వూరేగాల్సిందే" అని వుంది. ఇది వినేటప్పటికి తలిదండ్రుల గుండెలు గుభేలుమన్నాయి. కొడుకు వస్తాడని సంతోషించినా వూళ్ళో వూరేగింపు అనే వాక్యం వింటంతోటే వులిక్కి పడి, వుక్కిరిబిక్కిరయ్యారు. అందరి ఆగ్రహాలకు ఆహుతి అవుతామేమోనని ఆందోళన చెందుతున్నారు.

రామిగాడి జాబుముక్క పల్లెలోని కుల పెద్దల చెవుల్లో పడింది. తమకేం తెలియకుండా నిర్ణయించుకున్నందుకు నిప్పయ్యారు. ముందుగా ఏమాటా తమతో చెప్పనందుకు మండిపోయారు. "సిపాయిల్లోకెళ్లి కొత్త తెల్లపుల్లగా వుంటేమాత్రం పోగరుమోతు తనం సాగుద్దా? పూర్వకాలం నుండీ లేని పెండ్లి సంబంధాలు వూళ్లో అడుగు పెట్టటం ఏటికి ఎదురీదటమే అవుతుంది. ఇది మితం తప్పిన మిడిసిపాటు కాకపోతే మంచిదా? పొద్దున లేస్తే కాపుల కనుసన్నల్లో బ్రతికేవాళ్లం" అనుకొని రామిగాడి తండ్రిని పిలిచారు.

"ఏందిరా! నీ కొడుక్కేమైనా మిల్టరీలో మిగిలినదాంతో ఏమన్నా మంపెక్కిందా ఏంటి? తాత తరాలనుండి ఆచారం కానిదానికి అంకె వేసి అడ్డంగా నడిస్తే కాపులకు కోపం రాదూ? కాపుల కోపతాపాలతో పల్లెలో కాలం నిలపగలమా? మనకేమైనా పరువుల పోలాలన్న

వుంటే ఫరవాలేదనుకోవచ్చు. ఇది మీ ఒక్కరికే కాదు, పల్లె అంతానికే అపవాదుతో పాటు ఆపద వచ్చుద్ది. వాడొచ్చినాక అందరం చెప్పినామని చెప్పి ఆదరిపాట్లన్నీ ఆపు చేయించు" అని ఆజ్ఞాపించారు.

ఇక పల్లెలోని పడుచుకుర్రాళ్ళంతా రామిగాడి జాబుసు చేజేలు కొడుతున్నారు. అసలు రామిగాడు వస్తున్నాడంటేనే పట్టరాని సంతోషాలతో పొంగిపోతున్నారు. పెండ్లి సంబరాన్ని సాగించేందుకు చావుకైనా సై అంటూ సవాళ్లు కొడుతున్నారు. ఈ దెబ్బతో ఎదురు వచ్చినవాడినల్లా తిరగేద్దామనుకుంటున్నారు. ఈ అదనుతో అంటరానివారని విధించిన బంధనాలన్నీ ఛేదిద్దామనుకొన్నారు. "అదీకాక కాపులంతా కయ్యానికి కాలు దువ్వుతారంటే అది లేదు. కుర్రవారంతా కులాల కట్టుబాట్లన్నీ కాలదన్నుతూ కలసే వస్తున్నారాయె. పొలాల పనుల్లో పల్లెత్తు మాటాడక మాలమాదిగలతో మంచిగావుంటున్నారాయె. ఒకటీ అరతో పొద్దస్తమానం బండచాకిరి చేసి బతుకుతున్న ఒక్క రైతులు బడాయిలకు బయటకే రారు. మానసానికి మగ్గి మనతో మంచిగుంటానికి గోడమీద పిల్లి వాటంగావుండే నోటికీచేతికందని చిన్న రైతులు చెంతకే రారు. ఇంక ఆ ఒక్క మాధవయ్యా, ఆయనమాటను భుజాన వేసుకొనే ఆ పదిమంది ఎంత ఎదురు కంచెలు వేస్తే మాత్రం చెలగయ్యాక చూస్తామట్రా" అనుకొని రామిగాడి రాకకు ఎదురు చూస్తున్నారు.

రామిగాడు ఏ రోజు సిపాయిల్లో చేరాడు గాని ఆరోజుల్లో అంతంగా వెలిగిన మొనగాడు. పల్లెవంతటిని పలపెద్దల కట్టుబాట్లను లెక్కచేయక ఒక్క తాటిన నడిపిన తెరువ కలవాడు. అసలు రామిగాడి పేరు వింటేనే మోతుబరు లందరికీ ముచ్చెమటలు పోసేయి. రానురాను పని పాటలు పల్చబడి మగ్గంమీద పడుగేసేందుకు కూడా పనిలేకుండా పోయింది. మంచిరోజు లొస్తాయని వార్తలు విని ఆశించారు. కాని ఆరోజు కారోజు ఆశలు అరగిపోవటమేగాని పెరిగే పోలికలైనా కనబడలేదు. నూలు ధరలు నిచ్చెనంకైనా అందకుండా నిలువునా పెరిగిపోయాయి. వచ్చే అరపెట్టి నూలులో సేద్దామంటే నూకలైనా వచ్చేయి కాదు. దొంగ మార్కెటులో మూరి చేసినా మిల్లుబట్టకన్నా అంతులేని ధరపడి అందరికీ అందకుండా అయింది. అంతకీ అదే స్థితిలోవుంటే, పుటుక్కిన ప్రాణం పోయిందా. పాపం అని ఐనా అనకుండా "జబ్బుతో చీకిచీకి చచ్చాడు లే" అంటారు. అందుకని చివరకు చేతికందని పనై, నోటికందని తిండి అయి పొట్ట మాడ్చుకోలేక మిలిటరీలో చేరాడు. అక్కడకూడా ఆళ్ళ మాటకూడా ఖాతరు చేయటంలేదని ఇన్నాళ్ల పాటు వుంచి ఇంటికి పొమ్మన్నారు.

రామిగాడు రాసిన పలుకు పల్లెనుండి ఛెంగున చిందేసి వూళ్లో వూడిపడింది. మూడొందల ఎకరాల మోతుబరి మాధవయ్యకు కూడా తెలిసింది. వళ్లు సాంతం వుడికిపోయి నిప్పుతొక్కిన కోతిలా చిందులు తొక్కాడు. రామిగాడి రాకన్నంతనే వళ్లంతా జర్రులు పాకినట్లయి జలదరించింది. మిలిటరీలోవుంటే నన్నా ఏ కొరియాదంగానికో అంపేవాడిననుకున్నాడు. ఊరేగింపును వూరికే వదిలితే వుపయోగం లేదనుకున్నాడు. "ఈ దెబ్బతో ఒక్క పనికి రెండు ఫలితాలన్నట్లు" వూళ్లో బీదాబిక్కను "పొదిగిన కోడి క్రిందకు పిల్లల్లాగ" చంకక్రిందకు చేర్చుకుందామని, కదిలితే కూలి పెంచండని కేకవేసి ముందు నిలబడే మాలమాదిగలను పచ్చాకు పసరు పిండినట్లు పిండుదామనుకున్నాడు. కాపులందరితో కలసి మాట్లాడేందుకు రచ్చబండకాడ సభ జరిపేందుకు కార్యక్రమం నిర్ణయించుకున్నాడు.

మాధవయ్య అంటే సామాన్యుడు కాదు, వూళ్లోకి వచ్చిన ఆఫీసర్లందరిని అన్ని హంగామాలతో ఆదరించి అందినన్ని హోదాలు తగిలించుకున్న పెదకాపు. ప్రాంసరినోట్లను పదింతలయినా పెంచి దీపా లార్పటంలో దిట్టయిన చెయ్యి. అరిచేతిలో స్వర్గాలుచూపి పొద్దస్తం బండచాకిరి చేయించుకొని పైసల్లో పెనుగులాడే పిసినిగొట్టు. మాట్లాడితే బందిఖానాలో వేయిస్తానని భయపెట్టటంలో బహుమేటి. అందుకే అందరి ఈసడింపులకు గురి అవుతూ

చివరకు పదిమందిని పట్టుక వేళ్లాడుతున్నాడు.

మాధవయ్య రచ్చబండ కాడ సభ కురమ్మని పెండ్లి పిలుపులాగా ఇంటింటికి పిలుపు అందించాడు. చీకటిపడటంతోటే పిల్ల బీరుపోకుండా పిలచినచోటికి చేరారు. పెదకాపులైన పదిమంది రచ్చబండపై కూర్చొని పిడిమూరెడు పొరచుట్టల పొగలు గుప్పిస్తున్నారు. అంతలో మాధవయ్య ముందు నిలబడి "పల్లెలోని పెండ్లి వూరేగింపు వూర్లో వూరేగుద్దంట, పూటకు గంజిలేని గాడిదకొడుకులకు బతికేరోజులు లేకగాని బాగుపడేందుకా? రామిగాడు మిలిటరీలో మిడుకుతున్నా ననుకున్నాడేమో! పొట్టకులేక పట్టణాల్లో తిరిగి నాలుగుముక్కలు నేర్చుకున్నంతమాత్రాన కులాలన్నిటినీ కలగా పులగం చేద్దామనుకుంటే ఎట్లా? చిన్న పెద్ద, కాపు, కరణం అనకుండా కన్నుమిన్ను కన పడకుండా కవాతు తొక్కటం అనుకున్నాడల్లె వుంది. కదిత్తె వూర్లో కాలుబెట్టాలి. మెదిత్తె మన పొలాలకు మేతకు రావాలి. మూర్ఛెళ్ళ తిరి పొల కాడనుండి ఆఖరికి తొలకరింపు తొలినాట్లవరకు మన మోచేతి క్రింది నీళ్లుత్రాగి బ్రతకాలిసినవాళ్లు వూర్లో వూరేగుతామని అంటె వేయటం కాపులపై కంకణం కాక మరేంకాదు. మనం దీన్ని గాంగ దిగవిడిచామా వాళ్ళపెండ్లికి మనం ఇస్తళ్లు ఎత్తాలిసిందే. మనకు నిజంగా చీము రక్తం వుంటే వూరేగింపును అడ్డగించాల్సిందే" అని ఆ మాటా ఈ మాటాతో అర్ధరాత్రి చేశారు. చివరకు ఒక్క చిక్కు ఎదురైంది. "దీనికి అందరికీ సమ్మతమేనా" అంటే చప్పట్లచప్పుడి లేకపోతే చవుకగా వుంటుందని "నేను చెప్పిన సంగతు అన్నీ సమ్మతంకాని వాళ్ళంతా చేతులెత్తండి" అని ముగించాడు. మధ్య తరగతి రైతులంతా మతాచారాలన్నీ మంటగలిసి, మాలమాదిగల మాట చెల్లుబడి అవుద్దని చిరచిరలాడి పెదిమలు కొరుక్కున్నారు. దెబ్బలాటకు దిగితే వున్న సంసారాలన్నా వుండకుండా పోదల్లే మెతుకు లేని మోసం అవుద్దనుకొని "తప్పకుండా అడ్డగించండి" అని మాధవయ్యకు అండగా అరిచారు. బక్క రైతులు ఏ బరవాసాలు ఇయ్యకుండానే ఇంటి మొఖం పట్టారు. ఇదంతా మాధవయ్య మంత్రం తప్ప మరేం కాదనుకున్నారు. వూరేగింపు వచ్చినంతమాత్రాన మన మాట ముల్లెలు, పరువు ప్రతిష్ఠలు పాడయ్యేది ఏమి లేదనుకున్నారు. పెండ్లి పేరుచెప్పి మాధవయ్య తన పెత్తనానికి పగ్గాలు లేకుండా సాగించేందుకే ఈ సభ అంతా అనుకున్నారు. పేదాళ్ళలో పేచీలు పెంచి లాభాలు పోగు చేసుకునేందుకే ఈ ప్లాను అనుకొని ఇండ్లకు చేరారు.

రామిగాడు పక్కనేవున్న రైలుస్టేషనులో దిగి గుర్రపు బండిపై పరుగులమీద పల్లె చేరాడు. చేరటంతోటే పల్లెలోని పిల్లా, జెల్లా, ముసలా ముతకా అంతా పోయి పలకరించి వచ్చారు. యువకులంతా వుత్సాహంతో వుప్పొంగిపోతున్నారు. తమ జతగాని పెండ్లి జంజామృతంగా జరపాలనుకున్నారు. జరిగిన సంగతులన్నీ సందుపోకుండా రామిగాడి చెవుల్లో పోశారు. తలితండ్రులు వూరేగింపు సంగతెత్తి "ఒరే రామిగా! చేసేదేదో పల్లెలో చేస్తే ఏ పగలూ లేకుండా వుంటాయిగా? కాని దానికి కాలుదువ్వితే కయ్యానికి కారణమౌతాంరా!" అన్నారు.

ముసలాండ్ల మాట వినటంతోటే రామిగాడు మండిపడ్డాడు. వీళ్ళకు కుల పెద్దలు నూరిపోసిన రీతి పాతకమే ననుకున్నాడు. "వూర్లో వూరేగితే మన మెడలు తీసి ముల్లకలేస్తారా ఏం? మాధవయ్య మాటలకు నోరు మెదపక పోతే తప్పకుండా మెడలువిరుస్తాడు. ఏమున్నా జరగని, ఈ దెబ్బతో పెండ్లి వూరేగింపో, లేక కాటికి కదలింపో, కానిచ్చాల్సిందే" అన్నంతనే ముసలాండ్లు మరి మాట్లాడలేకపోయారు.

పెండ్లి ప్రయత్నాలు సరసర సాగుతున్నాయి. అచ్చు గుద్దించిన అరవేయి ఆహ్వాన పత్రాలు అందరకు అందించాడు. పక్క బస్తీనుండి అద్దెకు మంచి మోటారు టాక్సీ, దానిమీద తళుకు మెరుపులతో మెరిసే పూసలు పొదిగిన పూలిపాలిక, పాలికకు ముందుగా నాజూకైన పోజుల బొమ్మలతో సహా తెచ్చారు. మేళ గాండ్లంతా మాలిండ్ల పెండ్లికి రావటానికి ముందు జంకినా పైసం పెచ్చుని చూచి పరు

(తరువాయి 7వ పేజీలో చూడుడు)

...hed, Printed and Published by KHASA SUBBA RAU, at *Swatantra Printers*,

పది సంవత్సరముల తరువాత జీవిత పరిణామం

నిరూపించే "1950–60 నాటకం"

ప్రత్యేక ఆకర్షణలో




*Distributors:*

**CHAMRIA TALKIE DISTRIBUTORS**

**VIZIAWADA * GUNTAKAL * SECUNDERABAD.**